

ముగ్గురు ప్రధానులు

# మిసిమి

మాస పత్రిక

***"All that we are is the product of what we have thought," is "We are what we think." — Dammapada.***

సంపుటి 6 | జూన్ 1995 | సంచిక 71

సంపాదకుడు : రవీంద్రనాథ్ ఆలపాటి

## విషయసూచిక



**"Peacock Throne"** (The celebrated Peacock throne of Shah Jahan -the visual symbol of Mughal might and power) -Richard Wilson, was the first great British landscape artist. Born in North Wales. He began painting British views in the manner of Italian countryside, establishing the validity of British scenery as a subject for art.


తల్లి తండ్రులను మించిన
దైవము లేదు

# కవి సన్మానం

- చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి

స్వదేశోద్యమం ప్రారంభమైనాక మన ఆంధ్రదేశంలోనే కాదు; యితర దేశాలలో కూడా కవులకు సన్మానాలు జరుగుతూవున్న సంగతి అందఱూ యెఱిగిందే. ఆ సన్మాన సందర్భంలో ఆయా కవులకు కొన్ని బిరుదాలుకూడా యివ్వడం కొన్నిచోట్ల జరుగుతూ వుంది. ఆ బిరుదాలు పూర్వకాలంలోవుండే బిరుదాలను అనుసరించే వుంటూ వున్నాయి గాని వాట్లను వ్యతిరేకించి మాత్రం వుండడంలేదు. ఇట్టిస్థితిలో 6వ అక్టోబరు 1937 సం. ఆంధ్ర వారపత్రికలో ''కుక్కలవల్ల లాభమేమిటి?'' అనే శీర్షిక కింద కొన్నిమాటలు కుక్కలను గూర్చి వ్రాస్తూ ఆ వ్యాసకర్త బుద్ధి పూర్వకంగా కాదేమో? కాని కవులకవిత్వానికిన్నీ కుక్కల అఱుపులకున్నూ అసకృదావృత్తిగా పోలికను వుపపాదిస్తూ జనరల్‌గా కవుల నందఱిని కుక్కలనుచేసి వదలిపెట్టారు. ''న దుఃఖం పంచభిస్సహ'' కనక సర్వసామాన్యంగా వున్న వ్యాసకర్తగారి వుల్లేఖానికి యెవరుగాని విచారింపవలసి వుండనప్పుడు ఆ కుక్కల్లో వకకుక్క కలగజేసుకొని యేవో రెండఱుపులు అఱవడం అనవసరమే అయినను అసలు నేను అరవజాతిలో వాణ్ణి కావడంచేత కొంచెం అఱిచినందుకు వ్యాసకర్తగారు నన్ను క్షమించవలసిందని ప్రార్థిస్తాను. వ్యాసకర్తగారి వ్యాసంలోవున్న కొన్నిమాటలు మచ్చుచూపుతాను.

(1) ఓకుక్కకు యేం దురద పుట్టిందో?......మొదలు పెట్టింది కవిత్వం.

(2) అందులోనుంచి జంటకవివచ్చి అందుకుంది రెండోపాదం మఱో కుక్క.

(3) చివరపాదంలో పేరుతో సహా ఝుమాయించి కొట్టింది పద్య పాదాలన్నీ.

(4) మఱో శ్వానకవితల్లజుడు బయలుదేరాడు తీర్పుదిద్దడానికి.

(5) అపళంగా వేడెక్కింది కవిత్వవాతావరణం. వీటి దుంపతెగా: వూరుకుంటయ్యా? పంచరత్నాలు, నవరత్నాలు వ్రాసుకొచ్చినయి.

(6) అదికాదండీ కవిత్వం ప్రపంచానికి అంత అవసరమే అయి...

వోహో పొరపాటు చేస్తూన్నానే! వ్యాసకర్తగారి మాటలు చూపడానికి మొదలు పెట్టాను. వ్యాసమంతా యీ కుక్కల అఱుపు కవిత్వంతో అభేదంగా సమర్థించడంతోటే ప్రవర్తించింది. వుదాహరించవలసి వస్తే నాలుగుకాలాలున్నూ వుదాహరించవలసి వస్తుందిగదా! అందుచేత ఆ పని పనికిరాదు. యీలా వ్రాయడం యేదో ప్రౌఢత్వం అనే తాత్పర్యంతో వ్యాసకర్తగారు వ్రాసివుంటారు కాని యేవ్యక్తినిగాని యే సంఘాన్ని కాని మనస్సులో పెట్టుకొని వ్రాసినట్టు నాకు తోచదు. ''ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః'' ఆపద్ధతిని వ్యాసకర్త వుద్దేశ్యము విమర్శనార్హం కాదు. కాని ''శుచిర్విప్రశ్శుచిః కవిః'' అంటూ వేదం దగ్గిరనుంచీ పరిశుద్ధ పదార్థంగా అంగీకరిస్తూ వున్న కవిజాతిని పరమాపవిత్రమైన కుక్కలనుగా లోకానికి ప్రదర్శించడానికి యేర్పడ్డ యీవ్యాసాన్ని పరిశీలించకుండా పత్రికా ప్రవర్తకు లేమని ప్రకటించారో? కొంచెం విచారించవలసి వుంటుంది. కాని వారుమాత్రం ప్రతీవ్యాసాన్ని పరిశీలిస్తూవుంటారా? గవర్నమెంటు వల్ల చిక్కువచ్చే వ్యాసాలే కొన్ని ముందు ప్రచురించి తరవాత చిక్కు తెచ్చుకుంటూ వుండేవి వుంటాయి కదా! అందుచేత వారిని అడిగినా ప్రయోజనం లేదు. వ్యాసకర్తగారి వుద్దేశాన్ని గురించే మనలో మనం కొంత చర్చించుకునిచూదాం.

శ్లో. ''విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శుని చైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః ''

అన్న గీతవాక్యాన్ని బట్టిగోవునూ కుక్కనూ వకటేరీతిగా చూడడం దోషాపాదకం కాదని తేలడమే

కాకుండా పైగా విజ్ఞానుల తాత్పర్యమైనట్టు కూడా కనపడుతూ వుంది. కనక విజ్ఞాన్యగ్రేసరులైన వ్యాసకర్తగారు కవులను కుక్కలుగా చిత్రించి వుంటారా? బహుశా ఆశ్లోక తాత్పర్యం తక్కువ జంతువును కూడా యెక్కువ జంతువులతోపాటు సమ్మానించడమే కనక,

శ్లో : శ్వాన కుక్కుట మార్జాల పోషకస్తు దినత్రయమ్
ఇహజన్మని శూద్రస్స్యాచ్చండాలః కోటి జన్మసు.

అనే రకంతో చేరిన కుక్కలకు గౌరవం కలిగించడమే వ్యాసకర్తగారి తాత్పర్యమనుకుంటే ప్రస్తుత కాలానుగుణ్యంగా కూడా వుంటుంది గాని వ్యాసకర్తగారి కొన్ని వాక్యాలు దీనికిన్నీ అనుకూలించడం లేదు. (1) వీటి దుంపా తెగా, (2) వీటితాడు తెగా వీటిని యెట్లా పుట్టించేడో? దేముడు ఇత్యాదివాక్యాలు వ్యాసకర్తగారికి కుక్కలను గొప్పచేయాలనే తలంపున్న దనడానికి వప్పుకోవు. యీ ఘట్టంలో కొన్ని వాక్యాలు కవుల కొంపలకే కాక గాయకుల కొంపలకు కూడా వ్యాసకర్తగారు అగ్గిదాకొల్పే వుద్దేశంతో వున్నట్టు కనపడతాయి. వకటి వుదాహరిస్తాను.

''ఒకసమయం సందర్భం లేకుండా ఒకటేరాగం, ఒకటే మెడపట్లు, ఒకటే తదరినాంతోం; పైగా త్యాగయ్య మాదేశంలో పుట్టాడని గర్వం''

కవులను గురించిన వాక్యాలకన్న ఈవాక్యం యీ వ్యాసకర్తగారికి కొంత వుద్దేశం లోపల వున్నట్టే సూచిస్తుంది. త్యాగయ్య పుట్టినదేశం అఱవదేశం కనక ఆమాటనుబట్టి దక్షిణాదిగాయకులను తట్టాబాజీచేసే వుద్దేశంతో వ్యాసకర్తగారి లేఖిని ప్రవర్తించిందనుకోవడానికి అవకాశంవుంది. మొత్తం వ్యాసకర్తగారికి, కవులన్నా గాయకులన్నా బొత్తిగా పడదని ఆయా వాక్యాలు చెపుతూవున్నాయిగాని కొన్నిమాటలవల్ల యీాయన అంతో యింతో యీ రెండిటియందున్నూ ప్రవేశం కలవారనికూడా తేలుతూ వుంది. కవులకూ కుక్కలకున్నూ పోలిక చెప్పడానికి యింతవరకు నాకు ఆధారం అంత పనికివచ్చేది కనపడలేదుగాని గాయకులకుమాత్రం నకాయన చెప్పిన సంగతి జ్ఞాపకం వస్తూవుంది. దాన్ని వివరిస్తాను. భైరవిరాగమంటూ వకరాగం వుందికదా! ఆరాగం కుక్కల ధ్వనులనుబట్టే ఏర్పడ్డదని శ్రీకృష్ణగానచటికా భాగవతులు సెలవిస్తూవుంటే విన్నాను. భైరవశబ్దం కూడా దాన్ని తెలుపుతూనే వుంది. ఆరాగాన్ని పాడని గాయకులు వుండరు కనక యీ ''బదరీబాదరాయణ'' సంబంధాన్నిపట్టి వ్యాసకర్తగారి రచన కొంత సమర్థనీయంగా తోస్తుంది. వ్యాసకర్త సంస్కృతాంధ్రాలు అప్రధానంగానున్నూ యింగ్లీషు ప్రధానంగానున్నూ అభ్యసించినవారుగా తోస్తారు. సంస్కృతాంధ్రాలు చదివినవారికంటె యింగ్లీషు చదివినవారి రచన మృదువుగా వుంటుందని పలువురంటారు. నాకు ఇంగ్లీషు రాకపోవడంచేత వ్యాసకర్తగారి రచనయందుండే మార్దవం పాడకట్టడం లేదేమో? ఆసంగతిని. వ్యాసకర్తగారే వివరిస్తారు కనక విస్తరించేది లేదు. కవులను కుక్కలను చేయడానిక్కూడా వక ఆధారం దొరికింది. సుమారు యిప్పటికి యిర్వై యేళ్ళనాడు వొకానొక సంస్థానంలో దివాన్‌జీగారి యింటివద్ద దివాన్ జీ గారికి సూత్రభాష్యం పాఠం చెప్పడానికి వొక విద్వత్కవిశిఖామణి దయచేశారు. ఆ సమయంలో అక్కడ ఒక వుద్యోగి మంచి వాచాలకతాశక్తి కలవాడు, అంతో యింతో కవిత్వం చెప్పేవాడు, హాస్యప్రాయంగా మాట్లాడేవాడు, దివానుగారితో బాగా చనువున్నవాడు కూర్చుని వున్నాడు. యీాయన వచ్చిన కవిశిఖామణిని ''దయచేయండి కవిశునకంగారూ!'' అని సగౌరవంగా ఆహ్వానించేటప్పటికి దివాన్‌జీగారు నిలువునా నీరయిపోయి -- ''సరిలే! నేర్చుకున్నావు, నీకు సమయా సమయాలుగాని, యెవరి నేమాట అనాలో యెవరిని యేమాట అనకూడదో అనే పరిశీలనగాని బొత్తిగా తెలియదు. యెల్లప్పుడూ వొకటేహాస్యం దిక్కుమాలినహాస్యం'' అంటూ చీవాట్లు పెట్టడానికి ఆరంభించేటప్పటికి, ఆ తాబేదారు లేశమూ జంకక -- ''యేమిటీ? నాకాతెలియకపోవడం మీకా? వినండి. పూర్వపు రాజులు వేలకువేలు వెచ్చించి యేనుగులను కొని వాట్ల పోషణకు వేలకు వేలు ఖర్చుపెట్టేవారు. ఇప్పుడో? వున్న యేనుగులను

అమ్మివేయడమే కాకుండా వేలకువేలు ఖర్చుపెట్టి రకరకాలు కుక్కలను కొని వాట్ల పోషణకు వేలకువేలు ఖర్చుచేస్తూవున్నారు. ఆ కాలంలో సమర్థులైన కవులను అష్టదిగ్గజాలని వాడడం గౌరవంగా వుండేది. యీ కాలంలోనో? ఆపేరుకు గౌరవంలేదు. రాజానుమతో ధర్మః కాబట్టి కవి శునకపదమే బాగుంటుందో? మరోపదంబాగుంటుందో చూడం''డని వుపన్యసించడానికి మొదలు పెట్టేటప్పటికి దివాన్‌జీగారు 'పక్కున' కడుపు పగిలేటట్టు నవ్వారట! కవిగారు కూడా ఆయన సమయోచితజ్ఞత్వానికి మెచ్చుకున్నారట! యీ యితిహాసాన్ని బట్టి చూస్తే వ్యాసకర్తగారి రచన సమర్థనీయంగా తోస్తుంది. యింకా లోతుకు పోయి విచారిస్తే -- ''నానృషిః కురుతే కావ్యమ్'' అని వుండడంచేత కవులు ఋష్యంశ సంభూతులని తేలుతుంది. ఆఋషి సంఘానికి ప్రధానభూతుడైన ''శౌనకుడు'' శునకావత్యం అగునో? కాడోగాని ఆ పేరులో ఆ అర్థం ఇమిడి వుంది. దాన్నిబట్టి ఆఋషి తండ్రిపేరు శునకశబ్దంకాకతీరదు. యిదిన్నీశునశ్శేఫ- శునఃపుచ్ఛ-శునోలాంగూలపదాలతో వ్యవహరింపబడే ఋషులు వేదకాలంలోనే వున్నట్టు వేదవే ప్రమాణంగా కనపడుతుంది. యీ శబ్దాలు సాధించడానికే ''శేఫ పుచ్ఛలాంగూలాషుశునః'' అంటూ పాణిన్యాచార్యుల వారు వకసూత్రాన్ని నిర్మించి వున్నారు. యీ కాలంలో క్రమంగా ఋషికులజులైన బ్రాహ్మణుల గౌరవం తగ్గినట్టే పూర్వకాలంలో ఋషులంతగా గౌరవించిన శునకగౌరవం కూడా తగ్గిపోయిందని వ్యాసకర్తగారు ఆలోచించి మళ్ళా వాట్ల గౌరవం వాట్లకు నిలిపే వుద్దేశంతో రచన సాగించి వుంటారేమో? మొత్తం యివన్నీ వుత్ప్రేక్షలు. అన్యబుద్ధి అప్రత్యక్షంకదా! యిప్పటి వాళ్ళ కవిత్వం బొత్తిగా నచ్చక వ్యాసకర్తగారు వారి యేవగింపును యీద్వారాగా వెలిపుచ్చినట్టు తోస్తుంది. గాన విషయం కూడా డిటోగానే తోస్తుంది. అయితే వారి అభిప్రాయం యిది కాదేమో? కాదని వారు చెపితే మాత్రం వచ్చే సువాసన ఆగుతుందా? ఆగదు. అయితే సర్వజన సాధారణంగా ఆహ్లాదానికి యేర్పడ్డ సంగీత సాహిత్యాలమీద వ్యాసకర్తగారికీ ద్వేషాని క్కారణమేమో? అదిన్నీ విచారణీయమే. దానికి సమాధానం కనపడుతుంది, యేమిటంటే ఆ విద్యలను వీరు ద్వేషించడంలేదు. ప్రస్తుతం ఆవిద్యలను ప్రకటించేవారి ప్రజ్ఞాలోపాన్ని ద్వేషిస్తున్నారంటే సరిపోతుందిగా! ఆ. సరిపోతుంది. కాని ఆయన తరపున మనమా జవాబు చెప్పడం? ఆయనే చెపుతారు, లేదా, పత్రికవారేనా చెపుతారు. వారూ చెప్పరు, వీరూ చెప్పరంటారా? యీ కాలంలో కవులకున్న గౌరవ మింతే కాబోలు ననుకోవడమే. వ్యాసకర్తగారి వ్యాసాన్ని పలువురు కవులు చదివి వుంటారుకదా! వారెవరున్నూ కిక్కురుమనక వూరుకుంటే మీరే దీన్ని కదపడం ఎందుకు? అనే ప్రశ్నకు జవాబు చెప్పడం నామీద వుంటుంది. జవాబు కేముంది? యెవరు దీన్ని కదిపితే ఆప్రశ్న వారికే వస్తుంది. తగినంత వుద్దేశం లేకపోయినా వ్యాసకర్తగారికి కవులంటే పరమాసహ్యం అన్నంత వరకు దొంగాడి చేతులో పెట్టినా సారం తేలక మానదు. పయిగా ఆయన వుద్దేశాన్నిబట్టి చూస్తే కవి గాయకులంటే గడ్డిపరకలకన్నా కనిష్ఠంగా కనపడుతూ వున్నట్టు విస్పష్టమవుతుంది. అలా కనపడితే కనపడనివ్వండిగాని ఆ సంగతిని బయట పెట్టడం యెందుకో? నాకు గోచరించడం లేదు. అంత నీచంగా కనపడుతూవున్న కవుల సన్మానాల్లో పాలుగొనకపోవచ్చును, లేదా జరిగే సన్మానాలను తగినంత యత్నంచేసి ఆపుచేయ వచ్చును, గాని దిక్కుమాలిన కుక్కలతో సామ్యం చెప్పడం యెందుకోసమో? కొందఱు యెక్కువ ప్రౌఢంగా మాట్లాడడానికి మొదలుపెట్టి తుదకు - ''టెంకాయ పిచ్చికొండ'' చేయడమున్నూ లోకంలో కనపడుతుంది. ఇది ఆ తెగలోకే చేరుతుందేమో? కొందఱు భక్ష్యపదార్థాలుగావుండే మెంతికాయ వూటతోటిన్నీ మెంతి పెరుగుతోటిన్నీ హేయపదార్థాలను పోల్చి మాట్లాడడం కలదు. అలాగే కుక్కల అఱుపుతో కవుల కవిత్వాలకు చుట్టరికం కల్పివున్నారేమో వ్యాసకర్తగారు? యేమేనా యీ వ్యాసం వ్రాయడం కవులని తిట్టడానికి తప్ప కుక్కలని తిట్టడానికని కనపడడం లేదు. చూడండి! యీ వాక్యాన్ని-

''ఎప్పటినుంచో ఉన్నవాణ్ణి పండితుణ్ణి నేనిక్కడ వుండగానేనా మీ ఆటలు సాగడం అంటూ మిఠాయిదుకాణం పొయిలోనుంచి దూకింది మఱోకుక్క''

యీ వాక్యం పండిత కవులమీద వ్యాసకర్తగారికి వున్న కోపాన్ని పూర్తిగా వెల్లడిస్తూ వుంది.

''ఇంతలో మొరుగుడు శాస్త్రంలో మర్మం తెలిసిన మటో శ్వాసకవి తల్లజుడు'' అనే వాక్యం చెప్పనే అక్కరలేదు. వెనక శ్రీనాథుడుగారు కొండవీటిలో యెక్కడపడితే అక్కడే కవిత్వం చెప్పేవాళ్లు బయలుదేరడం చూచి వక గాడిదను వుద్దేశించి - కొండవీటిలో గాడిద! నీవునున్ గవివి గావుగదా? అంటూ ఒక హేలగా వక పద్యాన్ని చెప్పినట్టు వినడం. అయితే ఆయన లోకోత్తరుడైన కవి కనక ఆయన దృష్టికి సామాన్యులు నచ్చక అలా చెప్పినా కొంత సమర్థనీయం కావచ్చు. మన వ్యాసకర్తగారు ఆలాటి మహాకవి అని తోచడంలేదు. అంతటి మహాకవి కాదు కొంతటికవేనా అయివుంటే - ''తపోచిహ్నలు'' అని వ్రాయటం తటస్థించదనుకుంటాను. వ్యావహారికభాషలో యెలా వ్రాస్తే యేమంటారా? వ్యావహారిక భాషలోనేనా యీలాటి లోపాలు సహ్యాలు కావు. వారి జవాబు చూస్తేనేకాని యీవ్యాసం వారెందుకు వ్రాసిందీ తేలదు. జనరలుగా వ్రాసిన మాట మాత్రం సత్యం. యెవరుగాని దీన్ని -- ''కాలినిపోయే దాన్ని నెత్తినిరుద్దుకో'' వలసి మాత్రం లేదుగాని మొత్తం కవులందఱూ కలిగించుకోవలసినంత అనాలోచన లేదా తొందరపాటు దీనిలో కనపడుతూంది. కవుల తరువాత గాయకులకున్నూ వారి తర్వాత సన్యాసులకున్నూ కలిగించుకోవలసిన ప్రసక్తి దీనిలో వుంది. యెవరిక్కావాలి? తీరి కూర్చున్నవాణ్ణి కనక తోచీ తోచని యీ మాటలు రెండూ నేను వ్రాశానుగాని యితరులు కలగజేసుకోరు. అలా అనడానికిన్నీ వల్లకాదు. వెనక ''ఆంధ్రకవుల అపరాధాలు'' అంటూ బయలుదేరితే ఊరుకున్నారా? యెంతవఱకు చేయాలో అంతవఱకున్నూ చేశారు గదా? యీ వ్యాసకర్తగారు యేదో వక విధమైన కవిత్వం లోకాన్ని పునరుద్ధరిస్తుందనే నమ్మకం కలవారుగా వారి వ్యాసాంత మందలి యీ కింది వాక్యంవల్ల తేలుతుంది. దాన్ని వుదాహరించి రెండు మాటలు వ్రాసి ముగిస్తాను.

''కుక్కలు మొరుగుతూనే వుంటాయి, ఏనుగులు పోతూనే వుంటాయి. అని దాని అభిప్రాయం. ఇదే ప్రకృతి విరుద్ధం అయిన కవిత్వమంటే? ఇల్లాంటి కవిత్వమే మన హిందూదేశం ఇంత నీచస్థితిలో వుండడానికి కారణం.''

యీ వాక్యం ఆయన యేలాటి కవిత్వాన్ని మనసులో పెట్టుకొని వ్రాశారో చట్టన గోచరించకపోయినా ఆయనకి యేమాదిరి కవిత్వమందో ఆదరాతిశయం వుందనిమాత్రం తెలుపుతుంది. దీన్నిబట్టి కవిబాంధవులని తేలుతుంది. ఆలాటి కవిత్వాన్ని యిప్పటి కవులలో వకరు కాకపోతే మరివకరేనా చెప్పకపోవడంచేత పట్టరాని కోపం వచ్చి కవులందఱినీన్నీ కుక్కలుగా చేసి కృతకృత్యులైనట్టున్నూ పత్రికవారు దీని తత్వాన్ని అశ్రద్ధవల్ల పరిశీలించక లోకానికి అందించినట్టున్నూ నాకు తోస్తూంది. యీ విషయం అంత అత్యావశ్యకమే అయితే వ్యాసకర్తగారు స్వయంగానే ప్రకటించుకొనేవారు. అలా ప్రకటించుకోతగ్గ దీన్ని పత్రిక వారుపేక్షిస్తే కొంత బాగుండేదేమోనని నేననుకున్నాను. యీ వ్యాసకర్తగారు తమ పేరును వుదాహరించే వున్నారుగాని అల్లా వుదాహరించినా ''ఫలానా'' అని నాకు గోచరించలేదు. కాని సుప్రసిద్ధులై వుంటారన్నది మాత్రం నిర్వివాదాంశం. యీవ్యాసం వ్రాయడంలో వారికివున్న అంతరంగాభిప్రాయం యెట్టిదో తెలిపితే సంతోషం, లేదా అంతకంటే సంతోషం. యెంత సవిమర్శంగా దీన్ని చదివిచూచినా యిది కుక్కలకే సంబంధించిన వ్యాసంగా మాత్రం నాకు తోచడం లేదు. కుక్కలు ఆమాదిరిగా మొరగడాన్ని గూర్చి లోకానికి తెలపవలసినంత ఆవశ్యకత వుంటుందని తోచదు. అది సర్వసామాన్యమైన విషయం. వ్యాసమన్నప్పుడు అందులో యేదో కొత్త విషయం వుండి అది తాను మాత్రమే కనిపెట్టిందయితే ''ఏకస్స్వాదున భుంజీత'' అనే న్యాయాన్ని బట్టి యితరులకు కూడా ఆ మహా రహస్యాన్ని బోధించే తలంపుతో పత్రిక కెక్కించవలసి వుంటుంది. అట్టి రహస్యం దీనిలో వుంటే వ్యాసకర్తగారు తెలుపుతారని తలుస్తాను.

కొసమెరుపు

చ॥ హయ మది సీత, పోతవసుధాధిపు డారయ రావణుండు నిశ్చయముగ నేను రాఘవుడ సప్త్యాజ వారధి మారుడంజనా ప్రియ తనయుండు సింగన విభీషణుడా గుడిమెట్ట లంక నా, జయమును బోతరక్క సునిచావును నేడవనాడు చూడుడీ॥''

అనే పద్యం (యెవరిదో జ్ఞాపకం లేదు) మార్గదర్శకం. లక్ష్మణకవికి ఆ యీ పద్యంలో వున్న - సింగన్న పేరు కూడా తోడ్పడింది - యింతకూ చెప్పేదేమిటంటే? తగిన 'మేటరు' దొరకడంచేత లక్ష్మణకవిగారికి పేరు నిల్చే కవిత్వం వుదయించింది - కృష్ణమూర్తిగారికో అట్టి భాగ్యం పట్టింది కాదు.

''తద్వచనైన సార్థం విచ్ఛేదమాప, భువియస్తు కథా ప్రబంధః'' అన్నాడు బాణమహాకవి కొడుకు.

యింతకూ లక్ష్మణకవి పనిపడితే ఆయుధం చూపి కార్యాన్ని సాధించే కవేగాని - భిక్షాటకుడు కాడని ఫలితార్థం. అయితే,

**నాకబలి** : పళ్ళాలకు లక్ష్మణకవిగారు వెళ్ళడం వొకటి వుంది. యీ పళ్ళాలంటే యేమిటో యిప్పటివారికి తెలియనే తెలియదు. నాకు యిరవైయేళ్లు వచ్చేవఱకున్నూ కవులకు, తోలుబొమ్మలకు, హాస్యగాళ్ళకు, యింకా యెక్సెట్రాలకు కోమట్ల యిండ్లల్లో జరిగే వివాహాలలో పళ్ళాలు (సన్మానాలన్నమాట) కంపల్సరీగా యిచ్చే ఆచారం వకటి వుండేది. ఆ యేర్పాటు మన పూర్వ జమీందార్లు యేర్పఱచి ఆయావిద్యలకు పట్టాలిచ్చి వున్నారు. అందుచేత యిచ్చి తీరవలసిందే కాని యెగ్గొట్టడానికి వీల్లేదు. నేను కూడా వొకటి రెండు పళ్ళాలు యెత్తినవాణ్ణే. మా వంశం కవితావంశం కావడం ఆ గౌరవం మా ప్రాంతంలో మా వంశస్థులకు (కవిత్వం చేతకానివాళ్ళకు కూడా) వుండేది. యిటీవల కోమట్లు తెలుగుమీరి యివ్వడం మానేశారు. పిఠాపుర ప్రాంతం గొల్లప్రోలు గ్రామంలో కోర్టు దాకా వెళ్ళింది యీ విషయం. దానిలో కోమట్లే గెల్చి వుంటారు. పిండిప్రోలు కవిగారు పెళ్ళి అయిన సంవత్సరంలోగా యెప్పుడేనా వెళ్ళి వసూలు చేసేవారట! సకాలంలో మీరు రాలేదు గనక యిచ్చేది లేదని వొక కోమటి నిర్భయంగా శలాయించి కూర్చునేటప్పటికి మన కవిగారు.

**పిండీ, ప్రోలూ** లేకుండా నీయింట్లో పెండ్లేలా జరిగింది? బాగా ఆలోచించుకో జాగ్రత్త - అని కళ్ళెఱ్ఱజేసేటప్పటికి ఆ వర్తకుడు భయపడి కాలదోష శంక వదలుకొని పెండ్లి మామూలు యిచ్చి పంపించినట్టు చెప్పగా విన్నాను.

యీయన మాటలు అన్నీ యీలాగేవుంటాయి. యీయన పుట్టకతోనే ద్వ్యర్థికవి.

(1) కుళ్లుముండా గుడ్డుతుక్కుంటాను, బండముండా రాయియ్యవే.

(2) కమ్మకుమ్మొచ్చి పట్టుకుంది. (3) మాదిగవల్లి శివరావెక్కడున్నాడు నాయనా!

యీ వాక్యాలన్నీ యీయనవే. సమస్య-

'ఈశునకము కృష్ణమూర్తియే యెన్నంగన్.'

అని శిష్టు కృష్ణమూర్తిగారికి తగిలివచ్చేటట్టు వొక సమస్య యిచ్చేటప్పటికి కృష్ణమూర్తిగారికి కోపంవచ్చి-

''క॥ దాశరధీశబ్దమ్మును, దాశరధిపరమ్ము జేయుద్వ్యార్థికిదు, ధీశక్తి బిడాలమునకు, నీశునకము కృష్ణమూర్తియే యెన్నంగన్''

అని పూర్తి చేశారట! అసలు నల్లటికుక్కనుజూచి యీ సమస్యను యిచ్చాడట! తరువాత ఈశునకము (బాణము) కృష్ణమూర్తి శ్రీ మహావిష్ణువు (త్రిపుర విజయంలో నన్నమాట). ఆయన జీవితమంతా యీలాటి ప్రసంగాలతోటే వుంటుంది. రామలింగం తరువాత యీయన రెండో రామలింగమని యీచరిత్రను బట్టి చెప్పుకుంటారు-

మేధావుల మెతకలు

# వ్యక్తిగా – నియంతగా కామ్రేడ్ మావో

– 'మిసిమి' రచనల వర్క్‌షాప్

చైనాకు సంబంధించిన యిరవైనాలుగు రాజవంశ చరిత్రలు, సామ్రాట్టుల వ్యక్తిగత చరిత్రలు, వారి 'ప్రాథమిక జంతువులు' -యివన్నీ ప్రతిపాలకుని పరిపాలనా కాలంలో అమలులో వున్న మతాచారాలను, ఘోరకృత్యాలను, స్నేహసంబంధాలను, జ్ఞాపక చిహ్నాలను, భూదానాలను, నమోదు చేశాయి. యథార్థమైన రికార్డులు సార్వభౌముని అధికారులు రాసిన అనధికార చరిత్రలు, స్వంత పత్రికలు వుండనే వున్నాయి. వారి ఆంతరంగిక సిబ్బంది గట్టి నిఘా మూలంగానూ, వారి జీవిత రహస్యాలపై ఆవరించిన అభేద్యమైన రక్షణ కవచం వల్లనూ, కమ్యూనిష్టు దేశనాయకుల వ్యక్తిగత జీవితాలను గురించి రాయడం చాలా కష్టతరమైనపని.

అయితే, జిషుయి లి రాసిన ' The private life of Chairman Mao' ప్రత్యేకమైనట్టిది. విదేశీ శిక్షణ పొందిన యీ డ్యాక్టరు పరిచయ, పరిజ్ఞానాలవల్ల 'మావో ఆంతరంగిక జీవితం' గొప్ప అధికార వివరణ గ్రంథంగా రూపుదిద్దుకుంది. జిషుయి 1954 నుండి మావో మృతి చెందిన 1976 సంవత్సరము వరకు మావో ఆంతరంగిక వైద్యాధికారిగా వుండేవాడు. ఆయన అన్నగారికి చైనా విమోచనా పోరాటం ముందు నుండి కూడా కమ్యూనిష్టు పార్టీతో సంబంధం వుండేది. ఆయన సహాయంతో యీ రచయిత బీజింగ్‌కు తిరిగి రాగలిగాడు. తనకున్న దేశభక్తి ద్వారా దేశ ప్రజలకు సేవచేసే అవకాశం దొరికింది. మావోతో పనిచేయటానికి ముందు 1949లో చైనా కమ్యూనిష్టు పార్టీ కేంద్ర కమిటి పరిధిలోని ఫ్రాగ్రంట్ హిల్ వైద్యశాలలోని వైద్యశాస్త్ర విభాగంలో చేరాడు. అక్కడ నుండి జోన్గాన్‌హై వైద్యశాలకు బదిలీ చేయబడ్డాడు. ఆ జోన్గాన్‌హై మాస్కోలోని క్రెమ్లిన్ వంటిది. బాహ్యప్రపంచానికి సంబంధం లేకుండా, రక్షణ వలయంలో సైనిక రక్షణ గట్టి నిఘాక్రింద పార్టీ, ప్రభుత్వ నాయకులు తమ పనులను సాగించే ''నిషిద్ధనగరం'' అది.

మేధావులపై జరిగిన రెండు దాడుల నుండి జిషుయి బ్రతికి బయటపడ్డాడు. మొదటిది 1957-59 మధ్యకాలంలోనూ, రెండవది 1966-76 మధ్యలోనూ జరిగాయి. కాంగ్‌క్సింగ్ అనబడే రోగ దుశ్చింతాగ్రస్తుడిచే వెంటాడ బడ్డాడు. అయితే రక్షణ దళాధిపతి, పొలిట్‌బ్యూరో సభ్యుడు ఐన వాంగ్‌డానీక్సింగ్ సకాల సలహా మేరకు తప్పించుకోగలిగాడు. మావో చనిపోతూనే జిషుయి ప్రవమాదంలో పడ్డాడు. అయినా, ''దుష్టచతుష్టయం'' పతనం కావడంతో తాను తప్పించుకోగలిగాడు.

జిషుయిలి గ్రంథాన్ని డెట్రాయిట్ విశ్వవిద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ టాయ్ హంగ్‌చావో సమర్థవంతంగా అనువాదం చేశాడు. జిషుయిలి రాసిన వివరాలను ఫ్రెంచి ''జర్నల్'' శైలిలో తీర్చిదిద్దాడు. సులభశైలిలో పాఠకుల నాకర్షించేందుకు నవలా రచన శైలిలో అది జరిగింది. సులభశైలిలో పాఠకుల నాకట్టుకునే విధంగా వుండడంవల్లనూ, పార్టీనాయకుల వ్యక్తిగత జీవితాలపై అరుదైన సమాచారాన్నందించిన కారణంగానూ ఆ రచన ప్రజాదరణ పొందింది. అందులో అక్కడక్కడా రచయితకు తనపై తనకే జాలి, ద్వేషం కలయికగా వున్నట్టు కనిపిస్తుంది. తన భార్య చావు, న్యూరోసర్జన్‌కావాలనే తన వాంఛ నెరవేరకపోవడం వల్ల కలిగిన ఆవేదన ఆ గ్రంథానికి కరుణ రసాన్ని అందించింది.

తొంభై రెండు అధ్యాయాలున్న ఐదు భాగాల్లో తన జ్ఞాపకాలను క్రోడీకరించాడు. మొదటి భాగం మావో మృత్యువు తర్వాత జరిగిన నాటకీయ కుట్రలతో మొదలౌతుంది. రెండో భాగం 1949-57 మధ్య కాలాన్ని, మూడోభాగం 1957-1965 కాలాన్ని, నాల్గవ భాగం 1965-1976 కాలాన్ని ప్రస్తావిస్తుంది. అంతిమభాగం "The Aftermath" లో ''దుష్టచతుష్టయం'' అనబడే జియాంగ్‌క్వింగ్ (మావోసతి), జాంగ్ చున్‌క్వియొ, వాంగ్ హాంగ్‌వెన్, యొవెన్‌యుయన్ అరెస్టులను గురించి వివరిస్తుంది.

మావో చనిపోయిన తర్వాత మొదలైన నాటకీయ కుట్రతో మొదలెట్టి, రచయిత ఏవిధంగా మావోకు వైద్యునిగా తన నియామకం జరిగిందో తెలుపుతూ పోతాడు. మొట్టమొదటి మావో దర్శనం తన్ను ఎంతో ప్రభావితం చేసింది అంటాడు లీ. మావో ఆకర్షణీయమైన వ్యక్తి. అధికమైన వ్యంగ్య హాస్య చతురత ఆయనకుంది. ఆయన్ను మొదటిసారి కలిసిన వ్యక్తిని కూడా వినోదపరచి, అతను మనసిచ్చి మాట్లాడేటట్లు చేయగల వ్యక్తి మావో, తత్వశాస్త్రంపై ఆయనకెంతో అభిమానం. చైనా చరిత్రపై మావోకున్న లోతైన పరిజ్ఞానం రచయితను ముగ్ధుణ్ని చేసింది.

చైనా చరిత్రపై విశాల పరిధిలో చేసిన అధ్యయనంవల్లనూ, దేశం, దేశప్రజల గురించి ఆయనకున్న పరిజ్ఞానంవల్లనూ, చిన్నా పెద్దా తేడా లేకుండా ఎవరినుంచైనా సమాచారాన్ని బలవంతంగా రాబట్టే చాకచక్యం మావోకుంది. ఆ చాకచక్యమే, పెంగ్‌డెహుయి లాంటి అగ్రనాయకులను దెబ్బతీసేందుకు సహాయ పడింది. మేధావులను, పార్టీ నాయకులను తనకు వ్యతిరేకంగా స్వేచ్ఛగా మాట్లాడేటట్లు వారిని ప్రోత్సాహపరుస్తాడు. ఆ తర్వాత వారి నోరు నొక్కేందుకు చర్య తీసుకుంటాడు. పార్టీలో తన ప్రత్యర్థులను విమర్శించేటట్లుగా మేధావులను ప్రోత్సాహపరచడమే ఆయన ఎత్తుగడ. అయితే, అది ఎదురు దెబ్బ తీసినట్లయితే, వారిని చైనా ప్రజా కాంగ్రెసు నుండి అధికారాన్ని లాక్కొనేందుకు కుట్రపన్నే విప్లవ ద్రోహులుగా ముద్రవేసి గట్టిగా దెబ్బతీసేవాడు. పార్టీలో తనకు వ్యతిరేకంగా వున్నవారిపై తన అస్త్రాన్ని ఎక్కు పెట్టేవాడు. అయితే మేధావులపై చేసిన దాడి తిరిగి తననే దెబ్బతీస్తే వారితో తాత్కాలిక సంధి చేసుకొనేవాడు. అలాంటిది ''వంద పువ్వులు వికసించనీయండి'' అనే నినాదకాలంలోనూ, ఆ తర్వాత సాంస్కృతిక విప్లవ కాలంలోనూ, మితవాద వ్యతిరేక ప్రచార సమయంలో జరిగింది.

''గ్రేట్ లీప్ ఫార్వర్డ్'' ("Great Leap Forward") కాలంలో అత్యధిక సంఖ్యలో ఆరోగ్యవంతులైన రైతులు పొలాల్లో నుండి తొలగించబడి ''పెరట్లో ఉక్కు కర్మాగారాల''లో పని చేసేందుకు పంపించి వేయబడ్డారు. మిగిలిన స్త్రీలు, పిల్లలచే వారి శ్రమకు మించిన వెన్ను విరిచే నూర్పిడి పనులు చేయించారు. దాంతో పొలాల్లోనే పంట కుళ్లిపోయింది. ఎకరంలో ఎంత ధాన్యం పండుతుందోననే విషయం కూడా తెలియని పార్టీ నాయకులు అర్థరహితమైన అధికాహారోత్పత్తి ప్రకటనలను నమ్మేవారు. గ్రామ ప్రాంతాల్లో ఉత్పత్తి జరిగిన వాటిపై ఒకశాతం పన్ను విధించేవారు. అధికోత్పత్తి జరిగిందనే అబద్ధపు లెక్కల వుత్పత్తులపై కూడా ఒక శాతం పన్ను విధించడంతో, కొన్ని ప్రాంతాల్లో నిజంగా వుత్పత్తి చేసినదాన్ని మొత్తంగా పన్ను రూపంలో చెల్లించవలసిన పరిస్థితి ఏర్పడింది. అక్కడి ప్రజలకు తినడానికి కొద్దిగా మిగిలేది. అబద్ధపు సమాచారం ఎక్కువయ్యే కొద్దీ, ఆకలితో చనిపోయే ప్రజల సంఖ్య కూడా ఎక్కువైపోయింది.

విచిత్రమేమంటే, పన్నుల రూపంలో సేకరించిన ధాన్యాన్ని అప్పు తిరిగి చెల్లించే నిమిత్తం సోవియట్ యూనియన్‌కు ఎగుమతి చేసేవారు. మావో పరువు కాపాడేందుకు అలా చేయవలసి వచ్చింది. కృశ్చేవ్ గట్టిగా వ్యతిరేకించిన 'కమ్యూన్'లు చైనాలో విజయవంతం కాలేదని మావో అంగీకరించాడు.

ఇలాంటి మోసపూరిత వాతావరణం మావో యొక్క సృష్టియే. 15 సంవత్సరాల్లో బ్రిటన్‌ను మించిపోవాలనే వుద్దేశ్యంతో, వ్యవసాయోత్పత్తిని కమ్యూన్ల సహాయంతో మార్చివేసి, సమాజాన్ని కమ్యూనిజంలోకి నెట్టాలనీ, పేదరికం నుండి సమృద్ధిలోకి నడపాలనీ వూహాజనిత ఆడంబరమైన ప్రణాళికను రూపొందించి, మావో ప్రజల్లో అత్యాశను రేకెత్తించాడు. అలాంటిది అర్థరహితమని చౌయెన్‌లై, తదితరులకు తెలుసు. అయితే చైనా లోకోక్తి ఒకటుంది. ''చైనా రాజు తన పట్టమహిషి సొగసైన వనితగా వుండాలనే ఆశ వ్యక్తపరచాడు. దాంతో ఆయన వుంపుడు కత్తెలంతా, తమ బరువును తగ్గించుకొని సొగసుగా వుండేందుకు వుపవాసముండి చనిపోయారు.'' అలాగే మావో కూడా వున్నతపార్టీ, ప్రభుత్వ నాయకులంతా తన ఆడంబర పూరిత ప్రణాళికలను స్వీకరించాలని వారిని ముందుకు నెట్టాడు. ''యజమాని తన అభిలాషను వ్యక్తపరచడంతో సేవకులంతా గట్టి పట్టుదలతో దాన్ని నెరవేర్చారు'' - అదీ జరిగిన సంగతి. ఆఖరుకు తాను సృష్టించిన సామూహికావేశానికి తానే బలైపోయాడు.

'పెరట్లో ఉక్కు కర్మాగారాల' పథకం ఘోరంగా విఫలమైంది. అత్యంతవేగంతో వుత్పత్తి చేయాలనే వొత్తిడి కొనసాగడంతో ప్రజలు గత్యంతరంలేక తమవద్ద నున్న కుండలు, మూకుళ్లు, తలుపుల గుబ్బలు, ఇనుప ద్వారాల కుండే ఉక్కు, పారలు, కత్తులు అన్నింటినీ ధారపోయవలసి వచ్చింది. కొలుములను మండించేందుకు కావలసిన బొగ్గు లేదు. మంటలను రగిలించేందుకు బల్లలు, కుర్చీలు, మంచాలు లాంటి కలప సామాన్లను రైతులు వాడవలసి వచ్చింది. అయినా ఆ కొలుముల్లో తయారైన ఉక్కు నిరుపయోగమైనట్టిది.

''చిన్న పెరటి కొలుములు'' కమ్యూన్లు, ఉచిత సరఫరా పద్ధతి యివన్నీ వూహాజనిత వ్యర్థ ప్రయోగాలు. మార్క్సిస్టు సాహిత్యం చదవడంతో మావో మెదడులో యివన్నీ పుట్టాయి. బ్రిటన్‌తో సరితూగేందుకు అమలు జరిపిన యీ 'పెరటి కొలుములు' ప్రయోగం గురించి మావోకే సందేహాలున్నాయి. ''ఇలాంటి చిన్న పెరటి కొలుములు నిజంగా అంత అధికంగా ఉత్పత్తి చేసేటట్లయితే, విదేశీయులు ఎందుకు అంత భారీ ఉక్కు ఫ్యాక్టరీలను నిర్మిస్తారు?'' అనే సందేహాన్ని మావో వ్యక్త పరిచాడు. అయినా దాన్నే బలవంతంగా అమలు జరిపాడు. దానికి కారణం లేకపోలేదు. కొమింగ్‌టంగ్‌కు వ్యతిరేకంగా తాను జరిపిన ప్రచారం జయప్రదం కావడంతో ఆయన్లో అమోఘమైన అభిప్రాయం ఏర్పడింది. అయితే, నగ్నంగా, పస్తులుండే ప్రజలను కమ్యూనిస్టు సమాజంలోకి బలవంతంగా లాగడం నిరర్థకమనే ఒక చిన్న సత్యాన్ని ఆయన అర్థం చేసుకోలేకపోయాడు.

హెచ్చరించిన గొంతును నులిమేశాడు 'దుష్ట చతుష్టయం'లోని సభ్యుడు, షాంఘై పార్టీ యూనిట్ ప్రచార డైరెక్టరు అయిన జాంగ్‌మంకియొ యింకా కొందరు చైర్మన్ అనుగ్రహాన్ని సంపాదించుకొనేందుకు ఉచిత సరఫరా పద్ధతిని సమర్థించారు. ఆ నాయకులు అబద్ధాలు చెప్తూ మావో స్తుతికి పాల్పడ్డారు. సిగ్గు అనే భావాన్నే వారు వదిలేశారు. 'గ్రేట్ లీప్ ఫార్వర్డ్' ఫలితాలు ప్రమాదకరమైనవని మావోకు తెలిసినప్పటికీ, ప్రజల సృజనాత్మక శక్తులు నీరుగారిపోతాయనే భయంతో ఆ వుద్యమ గమనాన్ని తగ్గించేందుకు నిరాకరించాడు. జాక్సియావో, హూనాన్ రాష్ట్ర పార్టీ సెక్రటరీ, రక్షణ మంత్రి పెంగ్‌డెహుయి, టియాన్ జియాంగ్ అనే మావో రాజకీయ కార్యదర్శిలాంటి పెద్ద, మధ్యస్థ నాయకులు, గ్రామస్థాయి నాయకులు అయుష్న హెచ్చరించారు. ఆయన వారి సలహాను పెడచెవిని పెట్టాడు. వారు తనకు వ్యతిరేకంగా కుట్ర పన్నుతున్నారని భావించుటే దానికి కారణం.

చైనా బాగు కోసమే 'గ్రేట్ లీప్ ఫార్వర్డ్'ను మావో ప్రవేశపెట్టాడు. అయితే వచ్చిన సమస్య ఏమంటే మావోకు ఆధునిక విద్యలేదు. ఆధునిక ప్రపంచం అంటే మావోకు ఒక అభిప్రాయమంటూ లేదు. అందులో చైనాను ఏవిధంగా చేర్చాలో తెలియదు. 19వ శతాబ్దం పుపారిస్ కమ్యూన్ ప్రపంచంలోనే వుండిపోయి తన దేశాన్ని 20వ శతాబ్దంలోకి ఏవిధంగా నడిపించాలో చేతకాలేదు.

వైఫల్యానికి పైస్థాయి ఉద్యోగులను నిందించాడు. ఆయన అంచనా ప్రకారం వారు 'పైనుంచి వత్తిడి తెచ్చారు'. కాని వాస్తవంలో ఆ వొత్తిడి మావో నుంచే వచ్చింది. 1957లో తన్ను విమర్శించిన వారిని 'మితవాదులు'గా ప్రకటించి దయాదాక్షిణ్యాలు లేకుండా శిక్షించాడు. పార్టీ నాయకులు యథార్థాన్ని చెప్పనీయకుండా కష్టతరమైన వాతావరణాన్ని మావో సృష్టించాడు. పార్టీ నాయకులు విధేయతతో కానివ్వండి, భయంతో కానివ్వండి, ఆయన అడుగు జాడల్లో నడిచారు. తన తప్పును తెలుసుకోకుండా యితర నాయకులపై తప్పులను మోపి, సాంస్కృతిక విప్లవ కాలంలో వారిపై తన ద్వేషాన్ని అతి క్రూరంగా వెళ్లగక్కాడు.

మావోకు, లియోషాకి, లిన్‌పియావో, లియోషాకి మధ్య వైరుధ్య భావాలున్న రిపోర్టులను జిషుయి ధృవపరచాడు. మావో తనకు తానుగా అత్యున్నత నాయకునిగా భావించుకొని, మిగతా నాయకులంతా పార్టీ దైనందిన కార్యక్రమాలు నిర్వర్తించే తన అనుచరులుగా భావించాడు. అయితే లియోషాకి మాత్రం తాను మావో స్థాయికి సమానంగానో లేక కొద్దిగా దగ్గరి వాడుగానో భావించుకొని ప్రభుత్వ నిర్వహణలో తాను అనివార్యమైన వ్యక్తిగా భావించాడు. లియోషాకి ఎంతగా తాను మావోతో సమానమని నమ్మాడో, అంతగా మావో అతనితో అసంతృప్తి చెందాడు. మావో భార్య జియాంగ్‌క్వింగ్ లియోషాకి భార్య వాంగ్ గువాంగ్‌మితో ఏవిధంగానూ సరితూగలేదు. వాంగ్ గువాంగ్‌మి చాలా ఆకర్షణీయంగానూ, ఎక్కువగా అందరితో కలిసి మెలిసి వుంటుంది. అది జియాంగ్ క్వింగ్‌కు మనస్తాపం కలిగించింది. వాంగ్ గువాంగ్‌మిపై పగ, ద్వేషం, అసూయలను పెంచుకుంది. ఆమె దుష్ట స్వభావం లియోషాకి కుటుంబ సభ్యులతోపాటు ఎంతోమంది జీవితాల నాశనానికి నాంది పలికింది.

లియోషాకీని అధ్యక్షస్థానాన్నుండి తీసివేసి ఆపదవిని రద్దు చేసిన తర్వాత లిన్‌పియావో దేశాధ్యక్ష స్థానాన్ని ఆక్రమించాలనుకున్నాడు. అయితే చైనాకు చైర్‌మన్‌గా మావో ఒక్కడే వుండాలి. లిన్‌పియావో కుట్రను మావో గ్రహించాడు. చెన్‌బోడ ప్రథమ బలి పశువయ్యాడు. ఆ తర్వాత ప్రాంతీయ సపోర్టు సంపాదించి, తన స్థానాన్ని పదిలపరచే కార్యక్రమాన్ని చేపట్టాడు. మిలిటరీ కమాండర్లతో మావో జరిపిన సంప్రదింపులతో లిన్‌పియావో భయపడిపోయాడు. మావోను పడగొట్టేందుకు తానొక ఆయుధంగా తయారయ్యాడు. ఆ తర్వాత జరిగిన సంగతి అందరికీ తెలిసిందే. ఆ సంఘటన మావో ఆరోగ్యం, మనస్సుపై హానికరమైన ప్రభావాన్ని చూపింది.

పార్టీ సభ్యుల్లో వున్న వైరుధ్యాలను పరిష్కరించేందుకు చర్చలు, బోధనలను మావో ఎంచుకున్నాడు. అయితే మావో తన కర్తవ్యాన్ని నెరవేర్చలేదు. విమర్శనను ఎదుర్కొన్నప్పుడు గర్జించి, విమర్శకులను ఎదుర్కొనేందుకు తన స్వంత సైన్యాన్ని ఏర్పాటు చేస్తానని బెదిరించేవాడు. తనతో సమానంగా తూగగల సమర్థవంతులు, నిజాయితీ, దేశభక్తి గల అనుచరులు వ్యతిరేకించినప్పుడు తాము పెద్ద తప్పులు చేయడం ప్రజల ప్రయోజనం కోసమేనని చైనా చరిత్రకారులు చెప్తారు. కాని యిప్పుడు మనం గమనిస్తే శ్రామిక సాంస్కృతిక విప్లవకాలంలాంటి వాటిలో జరిగిన ప్రచారం దృష్ట్యా అది నిజం కాదని తెలుసుకోవచ్చు.

జిషుయి దృష్టిలో అత్యంత విలకడగల నాయకుడు డెంగ్‌క్సియాపింగ్. ఆయన ఒొప్పందలతో కూడిన బాధ్యతాయుత పద్ధతిని అవలంబించాలని పట్టుబట్టేవాడు. ఈనాడు ఆ ఒప్పంద సహిత బాధ్యతా విధానం రైతుల పాలిట పెన్నిధిగా మారింది. అయితే యాభైయవ దశకంలో ఆ పద్ధతిని ప్రతిపాదించినవారంతా పెట్టుబడిదారీ మార్గదర్శకులుగా ముద్రవేయబడ్డారు.

చరిత్ర ఎక్కువగా నిజానికి భిన్నంగా వుంటుంది. డెంగ్‌క్సియాపింగ్ సంస్కరణల పుణ్యమా అంటూ 1978 తర్వాత చైనా గురించి చాలా తెలిసినప్పటికీ, నిగూఢంగా వున్న యథార్థం చాలావుంది. ''వంద పువ్వులు వికసించనీయండి'' ''సాంస్కృతిక విప్లవం'' పేర్ల మీదుగా జరిగిన నీతిబాహ్య పనులకు యీ రచయిత ప్రత్యక్షసాక్షి. మావో గ్రామ ప్రాంతాలను సందర్శించినప్పుడు, గ్రామీణులతో మాట్లాడేటప్పుడు 'గ్రేట్ లీప్ ఫార్వర్డ్' ద్వారా అసాధ్యమైన దాన్ని పూర్తిచేయమని వొత్తిడి చేసేవాడు. చాంకైషేక్‌ను ఓడించడంలాంటి ఘన కార్యాలను సాధించిన మావో, పేదరికం నుండి ప్రజలను విముక్తి చేసేందుకు, వారి శక్తి సామర్థ్యాలను జాతి సేవకు వినియోగించేందుకు, ఆర్థిక పురోగమనానికీ కావలసింది మానసిక స్వేచ్ఛ అనే విషయాన్ని గ్రహించలేక పోయాడు. ఈ రచయిత సమక్షంలో ఒక గ్రామరైతు ఒక మెత్తని కోటును గురించి వెలిబుచ్చిన భావం ఎంతో విలువైంది. ఆ గ్రామంలో పనిచేసేందుకు ఒక రక్షణ సైన్యాధికారి మెత్తని కోటు ధరించి అక్కడికొచ్చాడు. ఆ గ్రామరైతు అతని కోటు వైపు వేలు చూపుతూ యిలా అంటాడు. ''నాకే గనుక అలాంటి పొడుగాటి కోటు వున్నట్లయితే, కమ్యూనిజం వచ్చిందని నాకు తెలిసి వుండేది''.

భూస్వాములకు వ్యతిరేకంగా జరిగిన పోరాటంలో బయల్పడిన నీచత్వాన్ని చాలా వుదాహరణలతో సహా రచయిత వివరంగా విశదీకరించాడు. భూస్వాముల కుటుంబాలకు చెందిన పిల్లలపై గుర్తులు వేయడమనేది చాలా అన్యాయం. సోషలిష్టు విజ్ఞాన ప్రచారమనేది కేవలం డబ్బు దండుగ వ్యవహారం. తన మనోరథానికి వ్యతిరేకంగా ఏమీ అనుభవం లేని వ్యక్తిని తెలియని ప్రదేశానికి పంపిస్తే అతడు ఏమి సేవ చేయగలడు!

''హై రుయి వుద్యోగం నుండి తొలగించబడ్డాడు'' అనే మింగ్ వంశ వుద్యోగిపై నాటకం ప్రచురించిన తర్వాత వూహాన్ వ్యవహారం సిగ్గుమాలిన సంఘటన. ఆ నాటకంలో ఒక దేశభక్తిగల మేధావికి స్వేచ్ఛ ఏ విధంగా నిరాకరింపబడిందో చిత్రించారు. 1957-58 కాలంలో జరిగిన ప్రచారం వల్ల యాభైవేల మంది తప్పుడుగా 'మితవాదుల'నే ముద్రవేయబడి, వుద్యోగాలు పోగొట్టుకొని, కార్మిక సంస్కరణ క్యాంపులకు పంపించబడి నికృష్ట చావులతో అంతమయ్యారని చైనా విదేశాంగ మంత్రి చెన్‌యి ఆరోపించాడు.

ప్రభుత్వోద్యోగుల తెలివి తక్కువ తనాన్ని కూడా జిషుయి బయటపెట్టాడు. పెకింగ్ యూనియన్ వైద్యశాలలో పనిచేసే మితభావాలు గల లీ జోంగర్, లీ కెహోంగ్ లాంటి డాక్టర్లను హింసించడమనే చర్య హృదయవిదారకమైంది. లిన్‌పియావో, జియాంగ్ క్వింగ్‌లాంటి ఉన్మాదులు అంత పెద్ద దేశమైన చైనాను అంత ఎక్కువకాలం భారీగా నష్టపరచారంటే ఎవరైనా-ఆశ్చర్యపడక తప్పదు. మావో యిచ్చిన ప్రోత్సాహంతో వారు తమ వ్యతిరేకులను అపనిందల పాల్జేసి, అవమానించి, శిక్షించ గలిగారు. మావో వ్యక్తిత్వం, శక్తివంతమైనమాట, బలమైన అభిప్రాయాలు మిగతవారి నోళ్లు నొక్కి లోబరచుకున్నాయి. ఆయన వాగ్ధాటికి అన్నింటిపై పైచేయి అయింది.

మావో స్వతహాగా న్యాయదృష్టి గలవాడు. ఈ విషయం లిన్‌కె, మావోయొక్క వృద్ధమంగలి కిషియూల వృత్తాంతంవల్ల గ్రహించవచ్చు. తన పెద్ద కుమారుడు మావోఏమింగ్‌ను 1950లో కొరియాకు అండగా యుద్ధానికి పంపించాడు. అక్కడ ఆయన బాంబు దాడిలో మరణించాడు.

దీన్నిబట్టి మావో యొక్క దృఢమైన నిష్పక్షపాత వైఖరి తెలియవచ్చింది. తన యిద్దరు కుమార్తెలు లిన, లి మిన్‌లను తన ప్రత్యేక వంటగదిలో భోంచేయనిచ్చేవాడుగాదు. వారిని యితరులతోపాటు ఉమ్మడి వంటశాలలో భోంచేసేటట్లు చేసేవాడు. ఆయన వ్యక్తిత్వంలో ఆసక్తికర విషయం ఒకటుంది. చైనా వైద్యంపై ఆయనకు ఎనలేని మక్కువ ఉన్నప్పటికీ, పాశ్చాత్య ఆధునిక వైద్యాన్ని ఎక్కువ యిష్టపడేవాడు. చైనా మొత్తంగా రష్యా భాష నేర్చుకుంటూ వుంటే, ఆయన తన డాక్టరు ద్వారా ఇంగ్లీషు నేర్చుకుంటూ వుండేవాడు.

మావో పబ్లిక్, ప్రైవేట్ జీవితంలోని లోతైన సమస్యలను ఆ జీవిత చరిత్ర ఎదుర్కొంది. అయినా ఆ ఎదుర్కోవడం నిష్పాక్షికంగా వుందని చెప్పలేము. యువతులతో మావో ప్రేమకలాపాలను తరచూ సూచించడాన్ని బట్టి, పాఠకులను దృష్టిలో వుంచుకొని వారిని వుల్లాస పరచేందుకే రాసినట్టు కనబడుతుంది. ఈ వుగ్రంథం త్వరలోనే అధికంగా అమ్ముడుపోతుందనే విషయం గురించి ఆశ్చర్య పడనక్కరలేదు. అయితే ఒక్క విషయం. మావో యొక్క ఏ స్నేహితురాలు కూడా ఆయన రాజకీయ నిర్ణయాలపై ఏలాంటి ప్రభావాన్ని చూపలేదనే విషయాన్ని వొప్పుకొని తీరాలి. రాజకీయాల నుండి వారిని ఎప్పుడూ దూరంగా వుంచాడు. జియాంగ్‌క్వింగ్ ప్రాముఖ్యంలోకి వచ్చి మావో చట్టబద్ధ భార్యగా గుర్తింపు పొందింది. ఆమె వివిధ రూపాల్లో అధికారంలోకి ఎగబ్రాకింది. దీనికి ఎక్కువ భాగం మావోనే బాధ్యుడు.

జోన్గాన్‌హై పరిధుల్లో జరిగిన వాటిని బహిర్గతపరచే గ్రంథం యిది. కొందరు ఆ మహానాయకుని అభాసుపాలు చేసే గ్రంథంగా పరిగణించారు. ఈ సమీక్షకుని దృష్టిలో మాత్రం ఆ దివ్య పురుషుణ్ణి మానవ మాత్రునిగా పరిగణించే ప్రయత్నం రచయిత చేశాడు. ఎంతగొప్ప మానవులైనా పొరపాట్లు చేసేవారని యీ జీవిత చరిత్ర తెలియ చేస్తుంది. మావోను వున్నత పీఠం నుండి నేలపైకి దించేసింది.

డాక్టర్ జిషుయి లి లాంటి ముఖ్యమైన వ్యక్తిని చైనా వదలి వెళ్ళేందుకు యిప్పటి చైనా నాయకులు వీలు కల్పించడం అసాధారణ విషయం. ఉన్నతస్థాయి నాయకుల రహస్యాలు, వ్యక్తిపర జీవిత వివరాలు జిషుయి కి అందుబాటులో వున్నాయి. అయినా పరాయివ్యక్తి మాదిరి జిషుయి రాశాడు. జపాన్ వ్యతిరేక యుద్ధంలోగాని, ఛాంగ్‌షేక్‌కు వ్యతిరేక పోరాటంలోగాని ఆయన పాల్గొనలేదు. ఆ కారణంగా, క్రిందివారిపై అనుమానం, తక్కువ అంచనా మావోకు ఉన్నప్పటికీ, అనుచరులకు మావోపై అభిమానం, గౌరవం ఉన్నాయనే విషయం గ్రహించడం రచయితకు కష్టమైంది.

## Steps to Stress - Proof your body

**Sort out your priorities**

If you fail to differentiate between the big problems and the little ones, and you fail to establish priorities in your life, you will suffer in a number of ways. First, the number of problems you are exposed to will prove damaging simply because there are so many of them. If you allow yourself to worry about the scratch on your car then your mind will simply add this anxiety to other, more essential worries. Unless you make a conscious decision to separate minor problems from major problems your mind will treat them all in the same way. Second, while you are worrying about minor threats you will fail to solve major problems. Getting your priorities sorted out isn't all that difficult. You must decide exactly what is important to you. Try to see things in perspective. Dont't be fooled into wasting time on things that are really not important to you. Make a list of the things in your life that are causing you stress. And decide which are really worth worrying about.

# అకర్మక - సకర్మక

-డా. సంజీవదేవ్

భాషలో క్రియది ఎంతో ప్రధానస్థానం. తెలుగులో తప్ప మిగతా భాషల్లో క్రియలేంది వాక్య నిర్మాణం పూర్తికాదు.

తెలుగులో ''అతడు ధీరుడు'' అంటే చాలు. ఆ వాక్యం పూర్తి అయినట్లే క్రియ లేకుండా. ''అతను ధీరుడు అయి వున్నాడు'' అననవసరం లేదు.

హిందీలోకాని, ఇంగ్లీషులోకాని ఆ పద్ధతి కుదరదు. హిందీలో ''హై'' అనే క్రియ వుండాలి. ''వహ్ ధీర్‌హై'' అని. ఇంగ్లీషులో ''ఈజ్'' అనే క్రియ వుండాలి, ''హీ ఈజ్ ఏ హీరో'' అని.

అందుకని తెలుగు వాక్యానికి క్రియ అవసరం లేదనికాదు. ఎక్కడో అరుదుగా కానీ అవసరం ఉండదు.

సాధారణంగా క్రియలు రెండు విధాలుగా వుంటాయి. ''అకర్మక, సకర్మక'' అని.

''ఎవరిని'', ''దేనిని'' అనే ప్రశ్నలకు జవాబులు రానపుడు అవి అకర్మక క్రియలు అవుతాయి, జవాబులు దొరికినపుడు సకర్మక క్రియలు అవుతాయి.

''నడుస్తున్నాడు'' అనే వాక్యాన్ని తీసుకొని ''ఎవరిని నడుస్తున్నాడు, దేనిని నడుస్తున్నాడు'' అని ప్రశ్నించినపుడు జవాబులు దొరకవు. కనుక నడుచుట అనేది అకర్మకక్రియ.

కాని ''నడిపిస్తున్నాడు'' అనే వాక్యాన్ని తీసుకొని అదే ప్రశ్న వేసినపుడు ''ఆమెను నడిపిస్తున్నాడు'', ''బండిని నడిపిస్తున్నాడు'' అనే జవాబులు దొరుకుతాయి. కనుక నడిపించుట అనేది సకర్మకక్రియ.

కనుక నడచుట అకర్మకం, నడిపించుట సకర్మకం అయినట్లే పోవుట అకర్మకం, పంపుట సకర్మకం; చచ్చుట అకర్మకం, చంపుట సకర్మకం; అవుట అకర్మకం, చేయుట సకర్మకం; పడుట అకర్మకం; పడవేయుట సకర్మకం; పుట్టుట అకర్మకం, పుట్టించుట సకర్మకం. ఈ విధంగా ఎన్నో మరెన్నో.

కర్తాకర్మలను ఒకటికంటే ఎక్కువ విధానాలుగా వాక్యంలో ప్రయోగించవచ్చు. మన భాషల్లో సాధారణంగా వాడుకునే వాక్యాల్లో ముందు కర్తా, తరువాత కర్మా, అటు తరువాత క్రియా వుంటాయి - 'అతను పుస్తకాన్ని చదువుతున్నాడు' అని.

ఇంగ్లీషు వాక్యరచనలో ముందు కర్తా, తరువాత క్రియా, అటు తరువాత కర్మా వుంటాయి - 'హి ఈజ్ రీడింగ్ ది బుక్' అని.

తెలుగులో కర్తా కర్మా క్రియలను మూడింటినీ స్థానాలను మార్చి వాక్యరచన చేయవచ్చు - అతనుపుస్తకాన్ని చదువుతున్నాడు, అతను చదువుతున్నాడు పుస్తకాన్ని, పుస్తకాన్ని చదువుతున్నాడు అతను. కవితా వాక్యాల్లో అయితే ఇంకా భిన్నత్వం చూపవచ్చు.

ఇక అసలు విషయానికి వస్తే మరో విశేషం ఏమంటే, కొన్ని క్రియలు ఎటు త్రిప్పినా సకర్మకాలుగానే నిలుస్తాయి.

తినుట అనే క్రియా సకర్మకమే తినిపించుట అనే క్రియా సకర్మకమే. అన్నాన్ని తింటున్నాను నేను, నేను అన్నాన్ని తినిపిస్తున్నాను. ఈ రెండు క్రియలు కూడా సకర్మకాలే.

అదే మాదిరి చూడటం, చూపటం కూడ - పక్షిని చూడటం చూపటం; రెండూ కూడ సకర్మక క్రియలే.

ప్రతి అకర్మక క్రియా సకర్మక రూపాన్ని కలిగివుంటుంది. లేచుట అనే అకర్మక క్రియ లేపుట అనే సకర్మక క్రియను కలిగివున్నది.

కాని కొన్ని సకర్మక క్రియలకు అకర్మక రూపాలు లేవు. వాటిని అకర్మకాలుగా మార్చాలంటే ''బడు'' ధాతువును చేర్చి కర్మణీవాచ్యం (Passive Voice)లోకి మార్చవలసి వుంటుంది.

ఉదాహరణకు, ''తుడుచుట'' అనే సకర్మక క్రియకు అకర్మకరూపం లేదు. దాన్ని ''తుడవబడుట''గా మార్చినపుడు మాత్రమే అది అకర్మకం అవుతుంది.

ఈ అకర్మక సకర్మక వాక్య ప్రాధాన్యం ఒక్క హిందీ భాషలో తప్ప మిగతా భాషల్లో లేదు. కారణం హిందీ భాషలో ''నే'' అనే పద ప్రయోగం వుడటంతో సకర్మకక్రియలోని భూతకాలంలో ఆ''నే'' అనేదాన్ని వాడటం అనివార్యమై వస్తూంది సాంప్రదాయికంగా.

''నేను తిన్నాను'' అనేదాన్ని హిందీలో ''మై ఖాయా'' అంటే సక్రమంకాక ''మైనే ఖాయా'' అనవలసి వుంటుంది, ఖాయా అనేది సకర్మక భూతకాలం కనుక. మై గయా అనే వాక్యంలో ఈ 'నే' పదాన్ని వాడనవసరం లేదు ''గయా'' అనేది అకర్మక భూతకాలం కనుక.

ఈ 'నే' ప్రయోగం వల్ల హిందీలో ఏది అకర్మక క్రియ, ఏది సకర్మక క్రియ అని తేల్చటం చాలా ప్రాధాన్యాన్ని వహించింది. అయితే ఈ విషయంలో కొన్ని అపవాదాలు కూడ లేకపోలేదు. కొన్ని సకర్మక భూతకాలాలకు 'నే' అనేదాన్ని చేర్చనవసరంలేదు. ఇటువంటి క్రియలు చాలా కొద్దిగా మాత్రమే వున్నాయి.

ఇక ఇంగ్లీషు భాషా విషయానికొస్తే కొన్ని విచిత్ర అకర్మక, సకర్మక క్రియా రూపాలున్నాయి. ఒకే క్రియ సందర్భాన్ని బట్టి అకర్మకం సకర్మకం కూడ అవుతుంది.

ఇంగ్లీషులోని కొన్ని అకర్మక భూతకాలాలు వాటి రూపాలు మారకుండానే సకర్మక వర్తమానకాలాలుగా వాడబడతాయి వాక్య నిర్మాణంలో.

The tree fell అనేదానిలో Fell అనేది అకర్మక భూతకాలం. ఆ వాక్యం ఆ చెట్టు పడెను అని అర్థం ఇస్తుంది. ఆ Fell అనే భూతకాలపు వర్తమానకాలం Fall అనేది. They fell the tree అన్నపుడు వారు ఆ చెట్టును పడవేస్తున్నారు అవుతుంది.

Fall అనేది అకర్మక వర్తమానకాలం. దాని భూతకాలం Fell అనేది కూడ అకర్మక క్రియయే. Fell అనే అకర్మక భూతకాలం సకర్మక వర్తమానంలో తిరిగి Fell గానే వుండిపోతుంది.

The tree fell: ఆ చెట్టు పడెను. They fell the tree: వారు ఆ చెట్టును పడవేస్తున్నారు.

ఒకే క్రియాపదం మారకుండా అకర్మక భూతకాలంగాను, సకర్మక వర్తమాన కాలంగాను ఉపయోగపడింది. Yesterday the tree fell; today they fell the tree. నిన్న ఆ చెట్టు పడింది; నేడు ఆ చెట్టును వారు పడవేస్తున్నారు. రెంటిలోను ఒకే క్రియాపదం, అకర్మకంగాను, సకర్మకంగాను, భూతకాలంగాను, వర్తమానకాలంగాను!

# దేవుడున్నాడా?

అనువాదం :
సరోజిని ప్రేమచంద్

మూలం :
జిడ్డు కృష్ణమూర్తి

ప్రశ్నిస్తున్నవారు : దేవుడు అనేవాడు అసలు వున్నాడా అన్న సంగతి నిజంగా తెలుసుకోవాలనుంది నాకు. దేవుడు కనుక లేకపోతే జీవితానికి అర్థమే లేదు. దేవుడు అంటే ఏమిటో తెలియకపోవడంవల్ల మనిషి వేలాది నమ్మకాలలో, వూహా ప్రతిమలలో అతన్ని ప్రతిష్ఠించుకున్నాడు. ఈ నమ్మకాలు తయారుచేసిన భయాలు, విభేదాలు మనిషిని తన తోటి మనుషులనుండి విడదీశాయి. ఈ విభజనలవల్ల కలిగిన బాధలనుండి, గోలల నుండి తప్పించుకోవడానికి మనిషి మళ్ళీ కొన్ని నమ్మకాలను తయారు చేసుకుంటాడు. మరింత దారుణంగా పరిణమించిన బాధలు, గందరగోళం అతన్ని చుట్టుముట్టేస్తాయి. తెలయకపోవడంవల్ల నమ్మకంలో పడతాం. దేవుడిని నేను తెలుసుకోగలనా? ఇండియాలోను, ఇక్కడ కూడా ఎంతోమంది మహాత్ములను యీ సంగతి అడిగాను. వాళ్ళంతా ''మొదట నమ్ము, ఆ తరువాత నీకు తెలుస్తుంది. నమ్మకం లేకపోతే ఏమీ తెలుసుకోలేవు'' అని నమ్మకాన్నే బలపరిచారు. మరి మీరేమంటారు?

కృష్ణమూర్తి : ఒక విషయం కనిపెట్టడానికి నమ్మకం అవసరమా? తెలుసుకోవడం కంటె నేర్చుకోవడం చాలా ముఖ్యం. నమ్మకం అంటే ఏమిటో నేర్చుకోగానే నమ్మకం అంతరిస్తుంది. నమ్మకాన్ని వదిలేసి స్వేచ్ఛ పొందినప్పుడే మనసు చూడగలుగుతుంది. నమ్మకం అయినా సరే, అపనమ్మకం అయినా సరే, రెండూ మనిషిని కట్టిపడేస్తాయి. ఎందుకంటే నమ్మకం, అపనమ్మకం రెండూ ఒకటే. అవి ఒకే నాణేనికి వున్న రెండు ప్రక్కలు. కాబట్టి నమ్మకం వుండటాన్ని, దానికి వ్యతిరేకమైనదాన్ని కూడా మనం పూర్తిగా త్రోసిపారేయాలి. విశ్వాసి, అవిశ్వాసి యిద్దరూ ఒక్కటే. ఇదంతా యథార్థంగా చూశాక, అప్పుడు 'దేవుడు వున్నాడా' అన్న ప్రశ్నకు అర్థం మరొకలాగా వుంటుంది. ''దేవుడు'' అనే మాటకు వెనకాల వున్న సంప్రదాయం, స్మృతులు, మేథనుసరించీ, భావోద్వేగాల ననుసరించీ, ఆ మాటకు మనం యిచ్చుకునే విశేషార్థాలు - యివన్నీ దేవుడు కాదు. ఆ మాట అసలైన నిజం కాదు. కాబట్టి ఆ పదాన్ని మనసు వదిలేయగలుగుతుందా?

ప్రశ్న : అంటే ఏమిటో నాకు తెలియడం లేదు.

కృష్ణ : ఆ మాట అంటే సంప్రదాయం; ఒక నిత్య సత్యాన్ని కనిపెట్టాలనే ఆశ, కోరిక; పరమార్థాన్ని చేరుకోవాలనే యత్నం; మన అస్తిత్వానికి ప్రాణ శక్తినిచ్చే ఒక వుద్యమం. అందువల్ల ఆ మాటే ఒక పరమార్థం అయిపోతుంది. అయితే, అసలైనది ఆ మాటలో లేదని మనం గ్రహించవచ్చు. మన మనస్సే ఆ మాట. మాట అంటే ఆలోచన.

ప్రశ్న : నాలోనుంచి ఆ మాటను తీసిపారేయమని మీరంటున్నారు. అదెట్లా సాధ్యం? ఆ మాటలో గతం వుంది, జ్ఞాపకాలు వున్నాయి. భార్య అంటే ఒక మాట, యిల్లు అన్నా ఒక మాటే. సృష్టి ఒక మాటతో ఆరంభమైంది. అంతేకాకుండా మాట ద్వారానే భావప్రసారం జరుగుతుంది. మాట ఒక గుర్తుగా పనిచేస్తుంది. మీరు అంటే మీ పేరు కాదు. అయినా కూడా మిమ్మల్ని గురించి నేను తెలుసుకోవాలంటే మీ పేరు పెట్టి అడగాలి. మీరేమో మనసు యీ మాటను వదిలించుకోగలదా, అంటే మనసు తాను చేసే పనులన్నింటినీ తానే ఆపివేయగలదా అని అడుగుతున్నారు.

కృష్ణ : చెట్టు అనే విషయం తీసుకుందాం. అందులో వస్తువు మన కళ్ళముందు వుంటుంది. ఆ మాట చెట్టుని గురించి అని అందరూ ఒక ఒప్పందానికి వచ్చారు. ఇప్పుడు 'దేవుడు' అనే మాట తీసుకుంటే, ఆ మాటకు సంబంధించినది ఏదీ లేదు. అందువల్ల ప్రతివారూ తమకు తోచిన వూహా చిత్రాన్ని సృష్టించుకుంటున్నారు. ఎందుకంటే ఆ మాటకు సంబంధించినది ఏదీ లేదు కాబట్టి. ఇది వేదాంతి ఒక రకంగాను, మేధావి మరో రకంగాను సృష్టించుకుంటారు. నమ్మకం వున్నవాడు, నమ్మకం లేనివాడు కూడా తమకు నచ్చిన పద్ధతుల్లో తయారు చేసుకుంటారు. ఆశలోనే యీ నమ్మకంపుట్టి, ఆపైన వెంపర్లాట ఆరంభమవుతుంది. ఈ ఆశ అసలు నిస్పృహ యొక్క - అంటే లోకంలో మన చుట్టూరా వున్నదంతా చూడటంవల్ల కలిగిన నిస్పృహ యొక్క పర్యవసానం. నిస్పృహలో నుంచే ఆశ పుడుతున్నది. ఇవి రెండూ కూడా ఒకే నాణేనికి వున్న రెండు ప్రక్కలు. ఏ ఆశా లేనప్పుడు అది నరకమే. నరకం అంటే భయం, కాబట్టి మనం ఆశకి ప్రాణం పోస్తాం. అప్పుడు భ్రాంతి ఆరంభమవుతుంది. కాబట్టి, ఆ మాట మనల్ని భ్రాంతిలో పడవేసిందే తప్ప దేవుడి దగ్గరకు మాత్రం చేర్చలేదు. దేవుడు అంటే భ్రాంతి. ఆ భ్రాంతిని మనం పూజిస్తున్నాం. ఇక అవిశ్వాసి యింకోరకం దేవుడిని గురించి ఒక భ్రాంతిని సృష్టించుకొని, దాన్ని పూజిస్తాడు. అదే తన దేశం లేదా ఒక భూలోకస్వర్గం లేదా సత్యం మొత్తం అందులోనే వుందని అతను అనుకునే ఒక గ్రంథం. అందువల్ల యీ భ్రాంతితోకూడుకున్న ఆ మాటను మీరు వదిలేయగలరా అని అడుగుతున్నాము.

ప్రశ్న : ఈ విషయమై నేను బాగా యోచించాలి.

కృష్ణ : భ్రాంతి లేనప్పుడు, యిక మిగిలింది ఏమిటి?

ప్రశ్న : ఉన్నది ఏదో అది మాత్రమే.

కృష్ణ : ఆ 'వున్నది' అత్యంత పవిత్రమైనది.

ప్రశ్న : 'ఉన్నది' కనుక అత్యంత పవిత్రమైనదయితే, అప్పుడు యుద్ధం అతిపవిత్రమైనది; ద్వేషం, అస్తవ్యస్తత, బాధ, దురాశ, దోపిడీ యివన్నీ పవిత్రమైనవి. అప్పుడు మనం మార్పు గురించి ఏమీ మాట్లాడకూడదు. 'ఉన్నది' కనుక పవిత్రమైనదయితే, అప్పుడు ప్రతి హంతకుడు, దోపిడీ చేసే ప్రతివాడూ, స్వలాభానికి యితర్లని వుపయోగించుకునేవాడూ, అందరూ - 'నన్ను ఏమీ అనకండి, నేను చేస్తున్నది పవిత్రమైన పని'' అని అనవచ్చు.

కృష్ణ : 'ఉన్నది' అత్యంత పవిత్రమైనది అన్న వాక్యంలోని సరళత్వమే దాన్ని చాలా అపార్థం చేసుకోవడానికి దారి తీస్తున్నది. ఎందుకంటే మనం అందులోని సత్యాన్ని చూడం. 'ఉన్నది' పవిత్రమైనది అని నిజంగా గ్రహించినప్పుడు, మీరు యుద్ధమూ చేయరు, ఆశలూ పెంచుకోరు, యితర్లని దోపిడీలూ చేయరు. ఇవన్నీ చేశాక, మీరు వుల్లంఘించిన ఆ సత్యమే మళ్ళీ మిమ్మల్ని రక్షించాలని మీరు కోరుకోవడానికి వీల్లేదు. ''ఉన్నది చాలా పవిత్రమైనది, దానిని ఎదిరించకు, దానిని మంటబెట్టకు'' అని హింసాకాండ చేస్తూ వీధుల్లో తిరుగుతున్న నల్లజాతి వాడితో అంటున్న శ్వేతజాతీయుడు 'ఉన్నది' ని గ్రహించలేదన్నమాట. ఎందుకంటే నిజంగా అతడు గ్రహించి వుంటే అతనికి ఆ నీగ్రో పవిత్రంగా కనబడివుండేవాడు. అప్పుడు యీ విధ్వంసానికి ఆస్కారమే వుండేది కాదు. కాబట్టి మనలో ప్రతి ఒక్కరూ యీ సత్యాన్ని చూస్తే, మార్పు తప్పక కలుగుతుంది. సత్యాన్ని గ్రహించడమే మార్పు.

ప్రశ్న : దేవుడున్నాడా లేదా అన్నది తెలుసుకోవడానికి నేను యిక్కడికి వచ్చాను. మీరు నన్ను పూర్తిగా గందరగోళంలో పడేశారు.

కృష్ణ : దేవుడున్నాడా అన్నది అడగడానికి మీరు వచ్చారు. ఆ మాట భ్రాంతికి దారితీస్తున్నది; ఆ భ్రాంతిని మీరు పూజిస్తున్నారు; ఈ భ్రాంతి కోసంగాను ఒకరినొకరం హతమార్చుకోవడానికి మనకు ఏ అభ్యంతరమూ వుండటం లేదు. ఏ భ్రాంతులూ లేనప్పుడు 'ఉన్నది' అత్యంత పవిత్రమైనది. అసలు యథార్థంగా వున్నదేమిటో యిప్పుడు చూద్దాం. మనం తీసుకున్న ఒక క్షణంలో 'ఉన్నది' భయం కావచ్చు, తళుక్కున మెరిసి మాయమయ్యే వుల్లాసం కావచ్చు. ఇవన్నీ నిరంతరం మారిపోతూనే వుంటాయి. ఇవి కాక, ''నా చుట్టూరా యివన్నీ మారిపోతూ వుంటాయి, కాని నేను శాశ్వతంగా వుండిపోతాను'' అని అంటున్న పరిశీలకుడు కూడా వున్నాడు. అది వాస్తవమేనా, అది నిజంగా అట్లా వున్నదా? అతను కూడా మార్పు చెందడం లేదూ? కొంత తనలో చేర్చుకుంటూ, కొంత తననుంచి తొలగించుకుంటూ రూపం మార్చుకుంటూ, సర్దుబాట్లు చేసుకొంటూ, మరొకలాగా అవుతూనో, అవకుండానో - అతడు మారడం లేదూ? కాబట్టి పరిశీలిస్తున్న అంశమూ, పరిశీలకుడూ రెండూ నిరంతరం మార్పు చెందుతూనే వుంటాయి. 'ఉన్నది' అంటే మార్పు. అది ఒక వాస్తవం. 'ఉన్నది' అంటే అదీ.

ప్రశ్న : అంటే, అప్పుడు ప్రేమ కూడా మార్పు చెందుతూ వుంటుందా? ప్రతిదీ మార్పు అనే కదలికకు లోనవుతున్నప్పుడు, ప్రేమ కూడా యిటువంటి కదలికలోనిదేగా? ప్రేమ కూడా మారుతూ వుండేదయితే, అప్పుడు నేను యీ రోజు ఒక స్త్రీని ప్రేమించవచ్చు, రేపు మరొక స్త్రీతో సంబంధం పెట్టుకోవచ్చు.

కృష్ణ : ప్రేమ అంటే అదేనా? ప్రేమ వేరూ, అది బయటకు వ్యక్తపరచడం వేరూ అని అంటున్నారా? లేదూ ప్రేమ కంటే వ్యక్తీకరణకే ఎక్కువ ప్రాధాన్యం యిస్తున్నారా? ఆవిధంగా పరస్పర వైరుధ్యాలనూ, సంఘర్షణనూ సృష్టిస్తూ, ప్రేమ మార్పు అనే చక్రంలో చిక్కుకొని పోతుందా? అప్పుడది ద్వేషంగా కూడా అయిపోవచ్చు. అప్పుడు ప్రేమ అంటే ద్వేషం. ఏ భ్రాంతులూ లేనప్పుడే 'ఉన్నది' అత్యంత పవిత్రమైనది. ఏ భ్రాంతీ లేనప్పుడు 'ఉన్నది'ని దేవుడనవచ్చు, లేదూ మీకిష్టమైన మరొక పేరు కూడా పెట్టుకోవచ్చు. కాబట్టి, దేవుడు కాని, మీరు పెట్టుకున్న మరొక పేరు కానీ మీరు లేనప్పుడే వుంటాడు. మీరు వున్నప్పుడు అది వుండదు. మీరు లేనప్పుడు ప్రేమ వుంటుంది. మీరు ఉంటే ప్రేమ వుండదు.

(ది అర్జెన్సీ ఆఫ్ ఛేంజ్)

## Steps to Stress - Proof your body

### Use your intuitive powers

If you tend to spend ages making relatively minor decisions - and find yourself getting into quite a state trying to decide what to wear, what to eat and so on-then give yourself a ten second limit for making your decision. You'll find this a remarkably liberating thought exercise. Simply make up your mind to follow whatever thought first sprang into your mind. The chances are that your first, instinctive solution was probably the best one. And with fairly minor decisions like these you haven't got much to lose any way. But you have got a lot to gain in terms of piece of mind.

# నేటి తాత్విక విమర్శలు - ధోరణులు

- డా. ఎన్. ఇన్నయ్య

ఇసుకలో ఆడుకుంటూ, సముద్రపు ఒడ్డున బొమ్మలు గీస్తారు. కొందరు ఇసుకమేడలు, కోటలు కడతారు. కాసేపు అవి బాగానే వుంటాయి. ఆ తరువాత అలలు వచ్చి కొట్టుకపోతాయి. ప్రకృతి పరిణామంలో మనిషి కూడా అంతే- ఫ్రెంచి తాత్వికుడు మైకల్ఫూకో (1926-1984) మానవవాదాన్ని దుయ్యబడుతూ చేసిన విమర్శ సారాంశం అది.

మానవ ప్రగతిని పేర్కొంటూ పునర్వికాసం, ఆధునికయుగం అని వర్గీకరించినట్లే, మానవవాదాన్ని కూడా చెబుతున్నారని మైకల్ ఫూకో (MICHEL FOUCAULT) అన్నాడు. పునర్వికాసం కొంతకాలం వుండి, తరువాత అంతరించింది. మానవవాదమూ అంతే. ఆధునికత పేరిట మానవవాదులు శాశ్వత తత్వాన్ని రూపొందించే ప్రయత్నం చేస్తున్నారు. అది తప్పు. మానవవాదం, ఆధునికత తాత్కాలికాలే. అవి కాలగర్భంలో కలసిపోతాయి. మైకల్ఫూకో విమర్శలకు మరొక ఫ్రెంచి తాత్వికుడు జీన్ఫ్రాంకో లెటార్డ్ (JEAN FRANCOIS LYOTARD) తోడై మానవవాదంపై ధ్వజమెత్తాడు. తత్వాన్ని పరిశీలిస్తే ఏం కనిపిస్తుంది? అన్నీ కథలు, అధిభౌతిక చర్చలు, అస్థిరత్వాన్ని గురించిన చర్చలు అని లెటార్డ్ అన్నాడు. ఆధునిక విజ్ఞానం కూడా అస్థిరత్వాల్ని వెతుక్కుంటూ పోతున్నదన్నాడు. ఫూకో ఈ అస్థిరత్వ ధోరణిని, మానవవాదాన్ని ఖండించాడు. సైన్స్ బంధంలో మానవుడు చిక్కుకపోయాడనీ, అతడిని విడిపించాలనీ ఫూకో వాదించాడు. వాస్తవాన్ని ఎదుర్కోలేక మానవవాదులు, ఇతరులపైబడి, అందరినీ పలాయనవాదులుగా నిరాశాపరులుగా చిత్రిస్తున్నారన్నాడు.

విశ్వంలో మానవుడు కేంద్రం అంటూ, నీతిశాస్త్రాల్ని సృష్టించే మానవవాదాన్ని ఫూకో, లెటార్డ్లు నిరాకరించారు. మానవుడి ప్రగతిని, ఆశావాదాన్ని వర్ణించడమే మానవవాదంగా చూపడాన్ని వారు నిరాకరించారు. మానవశాస్త్రాలన్నీ అస్థిరమైనవిగా వారు చూపారు.

మానవవాదుల తలబిరుసుతనాన్ని వివరిస్తూ డేవిడ్ ఎరన్ఫెల్డ్ విమర్శల పరంపర చేశాడు. (DAVID EHRENFIELD-THE ARROGANCE OF HUMANISM) మానవుడి భవిష్యత్తు నిర్మాణంలో మానవవాదుల కృషి ఏమీ లేదంటూ, వీరు కేవలం మానవ ప్రేమ పేరిట స్వార్థాన్ని పెంచుకుంటున్నారని డేవిడ్ విమర్శించాడు. ప్రపంచాన్ని మళ్లీ నిర్మించి, మానవుడు కేంద్రంగా వుండే తీరును వీరు వూహిస్తున్నారన్నాడు. వాస్తవానికి మానవుడే విధ్వంసానికి పూనుకుంటున్నాడనీ, మానవశక్తిని మరచిపోయి ప్రవర్తిస్తున్నాడన్నాడు. మానవుడు తన హద్దుల్ని తెలుసుకుంటే, సృజనాత్మకతలో భాగం పంచుకుంటాడనీ, అదే అతడికి తృప్తి కలిగిస్తుందన్నాడు.

ఆధునికతకు వ్యతిరేకంగా పోయే ధోరణికి ముసుగు వేసి చూస్తున్నారని జర్గన్ హాబర్మాస్ (JURGEN HABERMAS) అన్నాడు.

ఆధునికతపైనా, మానవవాదంపైనా సమకాలీన ప్రపంచంలో, ముఖ్యంగా యూరోప్, అమెరికా, ఆస్ట్రేలియాలలో విమర్శలు 1950 నుండే ఆరంభమయ్యాయి. దీనినే ఆధునికత అనంతర కాలం(POST MODERNISM)గా పేర్కొంటున్నారు.

రెండవ ప్రపంచ యుద్ధానంతరం సత్తావాది హైడిగ్గర్ (HEIDEGGAR) మానవవాదాన్ని ఎదుర్కొనడానికి శ్రీకారం చుట్టాడు. మానవుడిని ఉన్నతస్థానంలో కూర్చోబెట్టే ప్రయత్నంలో మానవవాదం విఫలమైందని, యుద్ధానికి, విధ్వంసానికి మూలం మానవవాదమేనని ఆయన మొదలెట్టాడు. ఆ తరువాత ఫ్రెంచి తాత్వికులు వియన్నా చింతనాపరుల్ని విమర్శిస్తూ, నిక్కచ్చిగా ప్రతిదీ వుండాలనే ధోరణిని ఖండించారు. అందులో భాగంగానే మానవవాదాన్ని చేర్చి, మైకల్‌ఫూకో, జీన్‌ఫ్రాంకో లెటార్డ్, డెరిడా (DERRIDA)లు చాలా విమర్శనాత్మక రచనలు చేశారు.

అమెరికాలో ఈ విమర్శల్ని అందుకున్నవారు, మానవవాదం వలన పాశ్చాత్యనాగరికత సృష్టించిన విలువలు పలచబడ్డాయని, కుటుంబవ్యవస్థ దెబ్బతిన్నదనీ, దైవనమ్మకం సడలిందనీ అన్నారు. ''నేషనల్ రివ్యూ'' ప్రచురణకర్త విలియం ఎ. రషర్ ఇలాంటి రచనలు చేశారు.

మానవుడు సృష్టించిన సాంకేతిక శాస్త్రం విధ్వంసానికి దారి తీసిందనీ, అన్ని సమస్యలకూ మానవుడే పరిష్కారాన్ని యివ్వగలడనుకోవడంలో మానవవాదం పొరపాటు పడిందనీ డేవిడ్ ఎరన్‌ఫీల్డ్ రాశాడు.

వాతావరణాన్ని, పరిసరాల్ని దృష్టిలో పెట్టుకోకుండా మానవుడు ప్రవర్తించడం, మానవుడే ముఖ్యం అంటూ, మానవుడి కోసం ప్రకృతిని నాశనం చెయ్యడం బైర్డ్ కాలికాట్ చూపాడు. దీనివలన మానవ కేంద్రనీతి ఎలా కాలుష్యానికి దారితీసిందీ వివరించాడు.

కంప్యూటర్ సృష్టితో సృజనాత్మకత, ఉద్వేగం దెబ్బతిన్నాయని మార్మికవాదులు, దివ్యదృష్టిని నమ్మేవారూ విమర్శలు చేశారు.

దేవుడిలో నమ్మకం కోల్పోతే నైతికంగా అరాచకత్వం వస్తుందనే వాదన పూర్వం నుండే వస్తున్నా, యిటీవల ''టైం పత్రిక'' ఎడిటర్ సైతం యిలాంటి విమర్శలు చేశాడు. హెన్రీ గ్రున్ వాల్డ్ తన విమర్శలలో, మానవుడికి దేనిపైనా నమ్మకం, గురి లేకుంటే, నీతి నిలబడదని వాదించాడు. సృష్టివాదులు కూడా అలాంటి వాదనే చేస్తున్నారు. మానవవాదంపై తీవ్ర విమర్శలు చేసిన వారిలో రష్యా రచయిత అలెగ్జాండర్ సోల్జినిట్సిన్, ఇర్వింగ్ క్రిష్టల్, రిచర్డ్ జాన్, న్యూహాస్ మొదలైన ప్రముఖులు వున్నారు

మానవవాదంపై మతం విమర్శిస్తే అర్థం చేసుకోవచ్చు. కాని తాత్వికులు, చింతనాపరులు విమర్శలు చేసినప్పుడు జాగ్రత్తగా పరిశీలించవలసి వుంటుంది.

మానవవాదాన్ని సమర్థించడంలోనూ, విమర్శల్ని పట్టించుకోవడంలోనూ యూరోప్, అమెరికా, ఆస్ట్రేలియాలు బాగా శ్రద్ధ వహిస్తున్నాయి. ఇండియాలో ఇంకా ఈ విమర్శలకు ప్రాధాన్యత యివ్వడం లేదు. అలాంటి విమర్శలు వున్నాయని కూడా ఏ కొద్దిమందికో తప్ప తెలియదు.

డేవిడ్ విల్సన్, జాన్ డ్యూయీ, కార్ల్‌లెమాంట్, కార్ల్‌వాగన్, ఐజక్ అసిమోవ్, పాల్ కర్జ్, అడాల్ఫ్ గ్రున్‌బాం, బార్బరాస్మోకర్ మొదలైనవారు విమర్శల్ని శాస్త్రీయంగా, హేతుబద్ధంగా ఎదుర్కొన్నారు

1980 ప్రాంతాల నుండీ మానవవాదానికి వచ్చిన అపఖ్యాతి తొలగుతూ పోయింది. మానవవాదం అంటేనే ఒక తిట్టుగా 1950-80 మధ్య ప్రచారం సాగింది. ఆ ధోరణి ప్రస్తుతం తగ్గుముఖం పట్టింది.

సంఖ్య రీత్యా మానవవాదులు ప్రపంచవ్యాప్తంగా అల్పసంఖ్యాకులే. కాని వారి వాదబలం నిలబడడానికి ప్రధాన కారణం వారు స్వీకరించిన ఆయుధమే. అదే శాస్త్రీయపద్ధతి. సామాజిక, మానసిక శాస్త్రాలలో సైతం వివేచనాత్మకంగా సాగాలని మానవవాదులు కోరుతున్నారు. థామస్ సాజ్ (THOMAS SZASZ) వంటివారు యిటీవల చేసిన విమర్శలే మానవవాదాన్ని మళ్ళీ పట్టాలపై నిలబెట్టడానికి ఉపకరించాయి.

ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న అతిప్రధాన సమస్యల్ని గుర్తిస్తే, ఒకటి జనాభా పెరుగుదలగానూ, రెండవది ప్రకృతిలో కాలుష్యవ్యాప్తిగానూ తేలాయి. మానవవాదులు యీ రెండింటినీ పట్టించుకుంటున్నారు. మతవాదులలో కొందరు మానవ నియంత్రణను వ్యతిరేకిస్తున్నారు. సోషియో బయాలజీ తత్వానికి పితామహుడైన ఎడ్వర్డ్ విల్సన్ ఈ సమస్యలపట్ల అటు మతవాదుల్ని ఇటు మానవవాదుల్ని కలిపి చర్చలు సాగించే కృషిని హార్వర్డ్ విశ్వవిద్యాలయంలో చేస్తున్నారు. తాత్వికంగా చూస్తే, పరిణామవాదాన్ని అంగీకరించిన మానవవాదులు ప్రకృతిని కాపాడుకోవడంలో వారు శ్రద్ధ వహిస్తారని విల్సన్ అంటారు. (ఫ్రీ ఇన్క్వైరీ 1993 స్ప్రింగ్, బఫెలో, అమెరికా).

జనాభా పెరుగుదలకూ, సంపదను శక్తిని వినియోగించడానికీ సంబంధం వుంది. ప్రకృతి పరిసరాలపై దీని ప్రభావం పడుతున్నది. కనుక మత గ్రంథాలు ఏంచెప్పినా, క్రమేణా యీ సమస్యల్ని గుర్తించి పరిష్కరించక తప్పదని ఎడ్వర్డ్ విల్సన్ అన్నారు.

తాత్వికంగా పరిశీలిస్తే మానవవాదులు ఫూకో, డెరిడా, లెటార్డ్ విమర్శల్ని తట్టుకోగలిగారు. వియన్నా తాత్విక సర్కిల్‌ను అధిగమించి, సైన్స్ పద్ధతులను వారు స్వీకరించగలిగారు. నిర్ధారణే కావాలని నేడు సైన్స్ కోరుకోవడం లేదు. పరిశోధనలు ఎటు దారి చూపితే అటు పోవడం నేర్చుకున్నారు. కార్యకారణవాదం స్థూల ప్రపంచంలో వున్నదనీ, సూక్ష్మ ప్రపంచంలో లేదనీ సైన్స్ నిర్ధారించింది. మానవవాదులు అందుకు అంగీకరించక తప్పదుగదా.

కోపర్నికస్ రుజువుల వలన ప్రకృతిలో భూమి చాలా స్వల్పం అనీ, డార్విన్ ఆధారాల వలన మానవుడు పరిణమించిన ప్రాణి అనీ తేలిన తరువాత, మానవవాదులకు వినయం, నమ్రత తప్పదు. మానవ సమస్యల పరిష్కారానికి మానవుడే కేంద్రం అంటారే తప్ప, మరేమీ కాదు.

మానవవాదంపై వచ్చిన విమర్శల దృష్ట్యా కళలు, రామణీయకతలు, కవితల విషయంలోనూ చాలా మార్పులు చేసుకున్నారు. రుజువుకు నిలబడని శక్తుల్ని ఆరాధించడం మానేసి, మానవుడికి ప్రాధాన్యత యిస్తూ ఆనందించే అన్ని కళల్ని పోషిస్తూ పెంపొందించుకుంటున్నారు. అంతేగాక పుట్టిన దగ్గర నుండీ చనిపోయేవరకూ వివిధ దశలలో ఉత్సవాలు, క్రతువులు, పండుగలు చేసుకుంటున్నారు. వీటిలో దైవం బదులు మానవుడే వుంటాడు. మరణించేటప్పుడు ఓదార్పు, అనంతరం బంధుమిత్రులకు వూరట కలిగించే రీతులు కూడా పెంపొందించారు. మతం ఆయా సందర్భాలలో పురోహితుడ్ని ప్రవేశపెట్టగా మానవవాదులు మధ్యవర్తిత్వాల్ని కాదని, సహకార భావంతో క్రతువులు చేస్తున్నారు.

**మానవుడిలో పెద్ద బలహీనత మరణమే. అది తలచుకొని భయపడుచున్నకొద్దీ, దాని చుట్టూ చాలా సిద్ధాంతాలు, తత్వాలు అల్లారు. అందులో భాగంగానే అమరత్వం, శాశ్వతత్వం, ఆత్మ, పునర్జన్మ, కర్మ, మోక్షం, నరకం మొదలైనవి వచ్చాయి. ఇంచుమించు అన్నిమతాలు మరణాన్ని ఆసరాగా తీసుకొని మనిషి బలహీనతలపై స్వారీ చేస్తున్నాయి.**

మానవవాదులు నిస్సహాయులుగా వున్నంతకాలం మరణం అనే వాస్తవం మనిషిలో ఎన్నో వికారాలు పుట్టిస్తుంది. మరణం సహజమని, తరువాత ఏమీ వుండదని, మనిషి భావాలు తరువాతివారు గుర్తుంచుకోవడం ప్రధానమని నచ్చచెప్పగలగాలి. ఈ విషయమై సుప్రసిద్ధమానవ తాత్వికుడు కార్లిస్ లెమాంట్ చక్కని రచన చేశారు. మరణం పట్ల మానవుడు ఎలాంటి ధోరణి అవలంబించాలో చర్చించారు. నమ్మకాల మధ్య పెరిగేవారికి ఇది కష్టమైన విషయం. అయినా మానవవాదులు చెప్పేది మానవకేంద్రంగా వున్న తత్వమే. మానవవాదంపై ఫూకో, డెరిడా, లెటార్డ్ చేసిన విమర్శలు నిలిచేవి కావు. మానవుడు దీర్ఘకాలిక పరిణామంలో తాత్కాలిక జీవి కావచ్చు. కొన్నేళ్ళకు ముందు మానవుడు లేనట్లే, కొన్నేళ్ళ తరువాత మానవుడు లేకుండా పోవచ్చు. అయితే సైన్స్ కాలమానం ప్రకారం అది కొన్ని కోట్ల సంవత్సరాలు పడుతుంది. తక్షణ ప్రమాదం మానవ ఉనికికి లేదు. ఈ దృష్ట్యా, మానవుడు ఇసుకలో బొమ్మవలే చెరిగిపోతాడనడం అంత ఉచితం కాదేమో!

సమకాలీన విమర్శలకై పరిశీలించాల్సిన రచనలు:


1. Michel Foucault : The Order of Things
2. Jean Francois Lyotard : The Post Modern Condition
3. Richard Rorty : The Consequences of Pragmatism
4. David Ehranfeld : The Aarrogance of Humanism
5. James Rachels : Created from Animals
6. Martin W. Lewis : Green Delusions
7. Bill McGibben : The End of Nature
8. Edward O. Wilson : The Biophilia Hypothesis 1993
9. Jacques Derrida : The End of Man in Margins of Philosophy 1982.
10. E. Ann Kaplan (ed) Post Modernism and its Discontents
11. Hugh Silverman (ed), Donn Welton : Post Modernism and Continental Philosophy.
12. Robert Basil (ed) On the Barricades 1989 Prometheus book, USA.
13. Corliss Lamout : The Illusion of Immortality 1990 Half Moon Foundation New York PP 303.

# గాన తపస్విని
# అంజనీబాయి మాల్పేకర్

– ఎస్. సదాశివ

ఇటీవల గంధర్వలోకం చేరుకున్న 'సుప్రసిద్ధ గాయకుడు కుమార్ గంధర్వ' సంగీతజ్ఞులయిన తన మిత్రులతో అంజనీబాయి గురించి తరచుగా చెప్తుండేవాడు. 'మాయి' అని పిలిచేవారామెను. ఆ కాలంలో చాలామంది ఆమెనలాగే పిలిచేవాళ్లు. మాయి అంటే తల్లి. కుమార్ గంధర్వకు సంగీత రహస్యాలు నేర్పేటప్పుడు ఆమె వయసు ఇంచుమించు ఎనభై సంవత్సరాలు. ఆ వయసులోనూ ఆమె ఏమాత్రం తొణకని మధుర గంభీర కంఠంతో సంగీత శాస్త్ర విశేషాలను తాను విన్న మహా గాయకుల గానశైలిని గంటలు గంటలు వినిపించేది. నడయాడే సంగీత విజ్ఞాన సర్వస్వమామె. సంగీత విద్యను సంపాదించటానికి ఆమె చేసిన సాధన అంతాయింతా కాదు. అదొక కఠోర తపస్సు. అందుకే సంగీత రసికులామెను గాన తపస్విని అని గౌరవంగా పిలిచేవాళ్లు. ప్రజలు పరవశించి యిచ్చిన ఆ బిరుదు నేడు ప్రభుత్వమిచ్చే పది పద్మశ్రీలపెట్టు. కుమార్ గంధర్వ అనేది కూడా బిరుదే. అతనిపేరు శివపుత్ర సిద్ధ రామప్ప కొంకళి. కాని ఆపేరు తెలిసిన వాళ్లు కొందరే. బాల గంధర్వ, సవాయిగంధర్వ, ఛోటా గంధర్వ అనేవీ బిరుదులే. ఆ బిరుదుల వలననే గుర్తింపబడిన ఆ గాయకుల అసలు పేర్లు వేరే.

కుమార్ గంధర్వది సహజసిద్ధమైన గంధర్వ గాత్రం. ప్రొఫెసర్ దేవధర్ దగ్గర శాస్త్రీయ పద్ధతిలో సంగీత విద్య నభ్యసించి, పట్టుదలతో సాధనచేసి గొప్ప గాయకుడైనాడు. ఏ సంగీత సభలోనో అతని గానాన్ని విన్న అంజనీబాయి మాల్పేకర్ ఆనంద పరవశురాలయింది. సభ ముగిసిన తర్వాత తన దగ్గరికి పిలిపించుకొని, ''కుమార్! నాదగ్గర లెక్కలేనన్ని బందిషులున్నవి. నేనెలాగూ సన్యసించినాను గదా. నా నేర్చిన విద్య వ్యర్థమైపోతున్నది. నీకిష్టమైతే కొన్ని చీజులు, బందిషులు నేర్పుతాను'' అన్నది. కుమార్ గంధర్వ ఆశించని మహాభాగ్యమది. ఆమె వాత్సల్యానికి ముగ్ధుడైనాడు. ఆమె పాదాలు పట్టుకున్నాడు. నిజానికి, ఇంకేదీ నేర్చుకునే అవసరం లేదతనికి. అప్పటికే అతని కీర్తి దేశం నలుమూలలా వ్యాపించింది. అయినా అంతటి మహనీయురాలు తనకు తానై నేర్పుతానంటే కాదనగలడా? అయితే, ఆమె నుండి తాను నేర్చుకోవలసింది చాలా వున్నదని త్వరలోనే గ్రహించినాడు. గాత్ర సంగీతానికైనా, వాద్య సంగీతానికైనా, నాట్యానికైనా నిత్య సాధన అవసరం. దాన్ని 'రియాజ్' అంటారు. మనదేశంలో అగ్రగణ్యుడైన తబలిస్టు ఉస్తాద్ అహ్మద్‌జాన్ తిరఖ్వా. అతడు తొంభైయేళ్ల వయసులో గూడా చీమలు పారేచోట, దోమలు కుట్టే చోట కూర్చుండి రాత్రుళ్లు కొన్ని గంటలు రియాజ్ చేసేవాడట. నాలుగు దశకాల క్రిందటే అంజనీబాయి రియాజ్ వదిలిపెట్టింది. అయినా ఒక జన్మకంతటికీ సరిపడా తపస్సు చేసివున్నది. కాబట్టి అప్పుడప్పుడు కొన్ని స్వరాలు మొరాయించినా ఆ వయసులోనూ అద్భుతంగా పాడేది.

ఒకనాడు భైరవిలో ఏదో చీజ్ తాను పాడి వినిపిస్తూ నేర్పుతున్నది. తన్మయుడై వింటున్నాడు కుమార్ గంధర్వ. ధీర గంభీరమైన ఆమె మధుర కంఠంలో భైరవి రూపు దిద్దుకుంటున్నది. కాని ఆమె ముఖంలో ఏదో అసంతృప్తి. ఏదో ఆందోళన. ఏదో అందుకునే ప్రయత్నం. అందుకోలేకపోతున్నాననే ఆవేదన. అదంతా ఎందుకో అర్థంకాలేదతనికి. ''మాయీ! మీ భైరవి పరమాద్భుతంగా వున్నది. మీ ముఖంలో ఆ అసంతృప్తి ఎందుకు?'' అని ప్రశ్నించినాడు. మాయి తంబురా ప్రక్కనపెట్టి నిట్టూర్చింది. ''నా భైరవి పరమాద్భుతంగా వున్నదా? ఒక లోపం కనిపించటంలేదా నీకు? భైరవీ రాగానికి చెందిన అన్ని స్వరాలను నాకంఠం సరిగా పలుకుతున్నది.

కాని నాకంఠం పలుకుతున్న మధ్యమ్ భైరవీరాగానిది- కాదురా. ఆమధ్యమ్ నాకు అందినట్లే అందుతున్నది కాని నా గొంతులోకి దిగటం లేదింకా. సాధన వదిలిపెట్టి చాలానాళ్లాయె గదా'' అని ఆవేదన వ్యక్తం చేసింది అంజనీబాయి. మూడురోజులు ఆ రాగాన్నే పాడుతూ కూర్చున్నదామె. చివరికి హఠాత్తుగా ఆమె గళంలోంచి ఒక విలక్షణమైన మధ్యమ్ వెలువడింది. ఆ స్వరం చేరగానే భైరవి సర్వాంగ సుందరంగా సాక్షాత్కారించినట్లయింది. కొన్ని క్షణాలు ఆయిద్దరూ ఆనందపారవశ్యంలో అలాగే వుండిపోయినారు. తర్వాత చెప్పింది, ''ఇదిరా కుమార్! భైరవిలో వుండాల్సిన మధ్యమ్. మధ్యమ్, గాంధార్‌లాంటి స్వరాలు చాలా రాగాల్లో వుంటాయి. పీలూ రాగంలో వుండే గాంధార్‌వేరు. మాల్‌కౌంస్‌లోవుండే గాంధార్‌వేరు. దేని స్వరూపం దానిదే. దేని స్వభావం దానిదే. దేని స్ట్రక్చర్ దానిదే. పాటకచేరీలు చేసే వాళ్లందరికి స్వరపరిజ్ఞానం వుంటుంది. స్వర పరిజ్ఞానం లేనిదే ఏరాగమైనా ఎలా పాడగలరు? పరిజ్ఞానం సరిపోదురా. పరిచయం కావాలె-'' ఇలా పన్నెండు స్వరాలతో పట్టి పట్టి పరిచయం చేసింది అంజనీబాయి. ఆ ముచ్చట్లే చెప్తుండేవాడు కుమార్ గంధర్వ.

స్వర పరిచయం అనగానే ఇదివరకు ఎక్కడో చెప్పిన కొన్ని ముచ్చట్లు జ్ఞప్తికి వస్తున్నాయి. అవన్నీ ఈ వ్యాసంలో అనసవరం. అయినా ఒక్క ముచ్చట చెప్పాలనే ప్రలోభాన్ని అణచుకోలేక పోతున్నాను.

నలభై, నలభైయైదేళ్ల క్రిందటి ముచ్చట. ఆలిండియా రేడియో బొంబాయిలోని ఐదవ నంబర్ స్టూడియోలో కొన్ని రాగాలు, ఠుమ్రీలు రికార్డుచేసి వెలుపలికి వస్తున్నాడు ఉస్తాద్ బడే గులామలీఖాన్. వెంట ప్రోగ్రాం ప్రొడ్యూసర్ కె.డి. దీక్షిత్ వున్నాడు. దీక్షిత్ సంగీతప్రియుడే కాక సంగీతజ్ఞుడు కూడా. అతనిపట్ల ఉస్తాదుకు అంతులేని అనురాగం. అంతలో రెండవ నంబర్ స్టూడియోలోంచి ఎవరిదో ఆలాప్ వినిపించింది. ఆలాప్‌లోనే ఉన్నాడా గాయకుడు. అస్థాయిని అందుకోలేదింకా. ''ఉస్తాద్! ఎవరోకాని భీంపలాస్‌ను చక్కగా ఆలపిస్తున్నాడు గదా!'' అన్నాడు దీక్షిత్. ఉస్తాద్ గుబురు మీసాల్లోంచి గుంభనగా నవ్వి తన భారీకాయాన్ని కారులో చేరవేస్తూ ''బేటా! అతడెవరో ఘరానా గాయకుడే. కాని అతడు పాడబోతున్న రాగం భీంపలాసి కాదు. మాల్‌కౌంస్ పాడుతున్నాడు. అతని గాంధార్ స్వరాన్ని గమనించు. అది భీంపలాసిలో వుండేది కాదు. మాల్‌కౌంస్‌లో వుండాల్సింది'' అన్నాడు. దీక్షిత్‌కది వింతగా తోచింది. అంత స్పష్టంగా భీంపలాసిరాగం వినిపిస్తుంటే మాల్‌కౌంస్ అంటాడేమిటి? తనకు ఆమాత్రం స్వర పరిజ్ఞానం లేదా? అయినా అంతటి ఉస్తాద్‌తో తర్కించే సాహసం చేయలేక పోయినాడు. కారులో అతన్ని దించవలసినచోట దించి రేడియో స్టేషన్‌కు తిరిగివచ్చి, సరాసరి రెండవ నంబర్ స్టూడియోకు వెళ్లినాడు. గాయకుడు తన పాట రికార్డు చేయించి వెళ్లిపోయినట్లు తెలిసింది. అతడు రికార్డ్ చేయించింది రాగ్ మాల్‌కౌంస్ అని గూడ తెలిసింది. ఉస్తాద్ చెప్పిందే నిజమాయెనా? అతన్ని ఉస్తాదని ఊరికే అన్నారా? 'స్వర పరిజ్ఞానం సరిపోదు. స్వర పరిచయం కూడ అవసరమే' అనుకున్నాడు దీక్షిత్.

ఈ అవాంతర విషయాన్ని వదిలిపెట్టి అసలు విషయానికి వద్దామిక. ఇది అవాంతర విషయమైనా అనవసర విషయం మాత్రం కాదు.

అప్సరసలవంటి అందం; కిన్నెరుల కంఠం; గంధర్వుల గాయనశైలి; ఈమూడు విశేషాలూ అంజనీబాయిగా మూర్తిభవించినవంటే అతిశయోక్తి అనిపించవచ్చు. కానీ స్వభావోక్తే. ఎంతటి అందమామెది! ఏమి గాత్రమామెది! పేచ్‌దార్, పల్టీదార్, దమ్‌దార్ తాన్లతో రవ్వలు రువ్వే ఆమె గానశైలి ఎంతటి సమ్మోహనశక్తి కలది!

ఎనిమిదేళ్ల వయసులో భేండీబాజార్ ఘరానాకు చెందిన ఉస్తాద్ నజీర్‌ఖాన్ చేత గండాబంధనం జరిగింది. సంగీతంలో గండాబంధనవంటే గురువుచేత దీక్షా కంకణం ధరించడం. ఉస్తాద్‌నజీర్‌ఖాన్ ధనాపేక్ష కలవాడు కాదు. గండాబంధన సందర్భంలో శిష్యురాలు పళ్లెంలో సమర్పించిన గురుదక్షిణలోంచి ఐదణాలు మాత్రం పరిగ్రహించినాడు. ''నా శిష్యురాలు గొప్ప గాయకురాలై నాకూ నా ఘరానాకూ కీర్తిప్రతిష్టలు ఆర్జించిపెడితే అదే నా గురుదక్షిణ'' అన్నాడు. పది సంవత్సరాలు నేర్పినా ప్రతిఫలం నామమాత్రంగానే స్వీకరించేవాడు. పదహారేళ్ల వయస్సులోనే మొదటి పాటకచేరీ ఘనంగా జరిగింది. ఆనాటి ఉస్తాదులూ, గాయనీమణులు ఆమె ప్రతిభను, సాధనను గుర్తించి ముక్తకంఠంతో ప్రశంసించినారు. అప్పుడు సభలోనే వున్న గురువుగారిని పట్టు వస్త్రాలతో సన్మానించి పదిహేనువేల రూపాయల గురుదక్షిణ సమర్పించి పాదాభివందనం చేసింది. ఉస్తాద్ నజీర్‌ఖాన్ శిష్యురాలి ప్రతిభను చూచి సంతసించేవాడు. అందాన్ని చూచి ఆందోళన చెందేవాడు. ''బేటీ! నీ ముఖాన్ని అద్దంలో చూచుకోకు. అలంకరణపట్ల మోజు పెంచుకోకు. రసికులయిన సంపన్నులను రంజింపజేయటానికి కాదమ్మా ఈ విద్య. భగవంతుడ్ని చేరుకునే తిన్నని బాటయిది.'' అని పదేపదే హెచ్చరించేవాడు. ఆ భయమే ఆమె తల్లి మనసులోనూ వుండేది. ఆమె అందాన్ని, గానకళా ప్రావీణ్యాన్ని వలచివచ్చిన ఒక సంపన్నయువకునికిచ్చి ఇరవైయేళ్ల వయసులోనే పెళ్లిచేసింది. ఆ దంపతుల అనురాగం ఆదర్శప్రాయమైంది. అతనిపేరు వసన్‌జీ భగవాన్‌దాస్‌వేద్. ఆ సంపన్న వ్యాపారికి ఏవో ఆర్థిక సంకటాలుండేవి. ఎవరితో చెప్పుకునేవాడు కాడు గాని లోలోన బాధపడేవాడు. అంజనీబాయి పాటకచేరీ ఎక్కడ ఏర్పాటయినా వెంట అతడుండవలసిందే. రాజుల, నవాబుల, అమీర్ల కాలమది. అనేకులామె విద్యను గౌరవిస్తే కొందరామె అందాన్ని మోహదృష్టితో చూచేవాళ్లు. ములుకుల్లా గుచ్చుకునే అలాంటి చూపులనుంచి తన్నుతాను రక్షించుకునే ప్రయత్నంలోనే ఎప్పుడూ వుండేదామె. అయినా ఆమె పొందినగౌరవం సామాన్యం కాదు.

''నేను సభలో ప్రవేశించగానే రాజులూ, మహారాజులూ, నా గౌరవార్థం నిల్చుండేవాళ్లు'' అని తన శిష్యులకు చెప్తుండేదామె. అది యథార్థం. బరోడా నరేశుడు శాయజీరావు గాయక్‌వాడ్ అంజనీబాయిని తన కూతురుగా భావించి ప్రతిసంవత్సరం చీర, రవికెతో సత్కరించేవాడు. ఇందోర్ నరేశుడు తుకోజీరావు హోల్కార్ ఆమెను సోదరిగా భావించి భావూదూజ్‌నాడు (దీపావళి తరువాతి విదియ) ఆహ్వానించి సత్కరించేవాడు. పాలన్‌పూర్ నవాబు ఆమెను ఛోటీ ''మీరాబాయి'' అని గౌరవించేవాడు.

ఒక సేఠ్ గారింట్లో గ్లాసెడు పాలుత్రాగి వచ్చిన తర్వాత ఆమె కంఠం మూగవోయింది. గాయకురాలి కంఠం మూగవోతే ఇక మిగిలిందేమిటి? రాగమెత్తటమటుంచి గట్టిగా మాట్లాడితేనే నోట్లోంచి రక్తం పడేది. ఎన్నిరకాల చికిత్సలు చేయించినా ఫలితం కనిపించలేదు. మంత్ర తంత్రాలు భూతవైద్యం ఏదీ ఫలించలేదు. ఆమెకు మూఢ విశ్వాసాలు లేవు. అయినా తనవారు తలపెట్టిన అన్ని రకాల చికిత్సలను చేయించుకున్నది. ఖేడ్‌గాంవ్ అనే వూరిలో నారాయణ మహారాజ్ అనే బాలయోగి ఉండేవాడు. అతని వయస్సప్పుడు పదమూడు, పధ్నాలుగేళ్లే. అంజనీబాయి అభిమానులు ఆ యోగిని ఆశ్రయించినారు. ''ఆమె గాత్ర శుద్ధి చేస్తాను. కాని ఆమె నాదగ్గర భజనలు పాడాలె'' అన్నాడా యోగి. గాత్రం బాగుపడాలె కాని భజన చేయుటం ఎంతపని? సమ్మతించినారు. మహారాజ్ రెండుమూడు లవంగాలు, ఖండశర్కర పలుకులు హోమంలోని విభూతి కలిపి యిచ్చినాడు. అది సేవించిన తర్వాత చిత్రంగా ఆమె గాత్ర శుద్ధి జరిగింది. మళ్లీ యథాప్రకారం పాడగలిగింది. బొంబాయిలో మహారాజ్ ఎనిమిది నెలలుండేవాడు. చాతుర్మాస్యం ఖేడ్‌గాంవ్‌లో గడిపేవాడు. ఆ ఎనిమిది నెలలూ అంజనీబాయి అతని సన్నిధిలో కొన్ని గంటలు భజనలు పాడేది. రానురాను ఆమె చిత్తవృత్తి దైవాయత్తమయింది. ఐహిక భోగాలపట్ల ఆసక్తి

ఒక బ్రహ్మాండమైన పాటకచేరి ఏర్పాటు చేసి తాను నేర్చిన విద్యతో సంగీత రసికులను ఆనందాబ్ధిలో ఓలలాడించింది. పాటకచేరి సమాప్తి చేస్తూ ''ఇక నేను పాట కచేరీలు చేయను. సంగీత సభల్లో పాల్గొనను. నా నేర్చిన విద్యను నారాయణార్పితం చేస్తున్నాను.'' అని ప్రకటించింది. అప్పుడామె వయస్సు 37 సంవత్సరాలే. ఈ వైరాగ్యానికి నారాయణ మహారాజ్ ఆదేశమే కారణమని అంతా అతన్ని నిందించినారు. పండిత్ రామకృష్ణ బువావఝె కోపం పట్టలేక ''ఆ సన్నాసికి సంగీతం సంగతేమి తెలుసు? ఒక అనర్ఘరత్నాన్ని మా అందరిలోంచి లాక్కున్నాడు.'' అని తన ఆవేదన వ్యక్తం చేసినాడు. వఝెబువా సామాన్యుడు కాడు. ఎందరో ప్రఖ్యాత గాయనీ గాయకుల గురువు. అంత సునాయాసంగా త్యజించిన ఆమె సంగీత సాధన సామాన్యమయిందా!

సంగీత సన్యాసం పుచ్చుకున్న నాలుగేళ్లకే భర్త హఠాన్మరణం అంజనీబాయిని కృంగదీసింది. లక్షాధిపతిగా పేరు గాంచిన ఆమె భర్త నిండా అప్పుల్లో మునిగివున్నాడని తెలిసింది. ఆమె తలచుకుంటే మళ్లీ తంబూరా పట్టుకొని పాటకచేరీలు చేసి లక్షలార్జించగలిగేది. కాని ప్రతిజ్ఞాభంగం చేయదలచుకోలేదు. పది లక్షల విలువ చేసే తన యావదాస్తిని తెగనమ్మి భర్త ఋణాలన్నీ తీర్చివేసింది. తానొక చిన్న యింటికి మారింది. ఆ యింట్లో దత్తాత్రేయుని పటం ప్రతిష్ఠించి ప్రతిదినం ప్రొద్దున పూజాసమయంలోను, రాత్రి హారతి సమయంలోను భజనలు పాడుతూ శేషజీవితం గడిపింది. శేషజీవితం చిన్నదా? దాదాపు యాభైయేళ్లు. సంగీత సాధనలోనైతేనేమి; దైవారాధనలోనైతేనేమి ఆమె జీవితంలో అరవయ్యేళ్లు తపస్సులోనే గడిచినవి. 'తపస్విని' అనే బిరుదు ఆమెకు అన్నివిధాలా సార్థకమైంది. చివరి రెండు సంవత్సరాలు చాలా కష్టంగా గడిచినవి. దేనికీ కొరతలేని సంసారం గడిపిన ఆమెకు చివరిదశలో అన్నింటికీ అభావమే. వార్ధక్యంలో కాలు జారిపడినందున వెన్నెముక విరిగింది. కుమార్‌గంధర్వ వందనీయ అయిన తన గురుమాత సేవలో ఏలోపం చేయలేదు. శిష్యులూ, అభిమానులూ, ముఖ్యంగా నేటిప్రఖ్యాత గాయని కిశోరీ అమోన్కర్ అన్ని విధాలా ఆదుకున్నారు. ఆ స్థితిలోనూ ఆమె నిత్యానందానుభూతినే పొందింది. కానీ దైన్య భావాన్ని దరిచేరనీయలేదు. ఎవరినీ కష్టపెట్టక, తానూ ప్రాణప్రయాణాయాసాన్ని పొందక నిద్రలోనే హాయిగా గంధర్వ లోకానికి వెళ్లిపోయింది.

ఉస్తాద్ నజీర్‌ఖాన్ కిద్దరు సోదరులు. వాళ్లు ధ్రుపద్ ధమార్ గాయనంలో ఆరితేరినవారు. గ్వాలియర్ ఘరానాకు చెందిన ధ్రుపద్ ధమార్ గాయనంలోను ఆమె పరిశ్రమ చేసింది. ఉస్తాద్‌నజీర్‌ఖాన్‌తోనూ, అతని సోదరులతోనూ సంగీత విషయాలు చర్చించటానికి తరుచుగా పండిత్ భాత్‌ఖండే వచ్చేవాడు. ఆ చర్చలు వింటూ ఆమె అనేక సంగీత రహస్యాలు తెలుసుకున్నది. హిందుస్తానీ సంగీతాన్ని వ్యవస్థీకరించి దానికొక సిలబస్ తయారు చేసిన మహనీయుడు పండిత్ విష్ణునారాయణ భాత్‌ఖండే.

వల్లభ సంప్రదాయానికిచెందిన ఆచార్య శ్రీ జీవన్‌లాల్‌జీ మహారాజ్‌ను సేవించి భక్తి సంగీతం నేర్చుకున్నది. ఆగ్రా ఘరానాకు చెందిన ఉస్తాద్ నత్థన్‌ఖాన్ గాయనశైలిని సొంతం చేసుకున్నది. ఆమె గురువు ఉస్తాద్ నజీర్‌ఖాన్ పదేళ్లు సాధన చేయించినాడు. మొదటి ఐదేళ్లలో అతడు నేర్పినవి రెండే రెండు రాగాలు. యమన్ కళ్యాణ్, భైరవి. రెండూ సంపూర్ణ రాగాలే. యమన్‌లో అన్నీ తీవ్ర స్వరాలు. భైరవిలో అన్నీ కోమల స్వరాలు. ఈరెండు రాగాల మీద సంపూర్ణాధికారం, సంపాదిస్తే పన్నెండు స్వరాలతో పరిచయం కలిగినట్లే. ఔడవ, షాడవ రాగాలు నేర్చుకోవటం చాలా సులభం. ఆమె కంఠగతం చేసుకున్న చీజులు, బందిష్‌లు కొన్ని వందలు.

సంగీత సన్యాసం పుచ్చుకునేముందు కాశీ విశ్వనాథాలయంలో పాటకచేరీ జరిపింది. ఆ కచేరీలో పాల్గొనటానికి ఆనాటి పెద్దలంతా వచ్చినారు. కాశీనరేశుని పర్యవేక్షణలో జరిగిన పాటకచేరీ అది. విశ్వనాథునికి జలాభిషేకంతోపాటు స్వరాభిషేకం చేసి శివార్పణమని తంబూరాను గవిసెనలో దాచిపెట్టింది. ఆ తంబూరా కొల్హాపూర్ నరేశుడు ఛత్రపతి సాహూ మహారాజ్ బహూకరించింది.

# ఆచార్యనాగార్జున : మధ్యమక కారిక

## ప్రథమ ప్రకరణం : ప్రత్యయపరీక్ష

- ఎమ్. రాజగోపాలరావు

ప్రత్యయ పరీక్షతో ప్రారంభించి దృష్టిపరీక్షతో పూర్తయే మధ్యమక కారిక 27 ప్రకరణాలలో. ఆస్తికులయిన నైయాయికులు, వైశేషికులు, సాంఖ్యులు, యోగులు యథార్థాలుగా అంగీకరించే ద్రవ్యాలు, గుణాలు, వాటిసంబంధాలు, కాలం, దిక్కు, గతి, సంభవ విభవాలు, కర్మ, ఆత్మవంటి వాటితోపాటు థేరవాద.బౌద్ధులయిన విభాజ్యవాదులు, అభిధార్మికులు, సర్వాస్తివాదులు (వైభాషికులు), సౌత్రాంతికులు - యథార్థాలుగా అంగీకరించిన నామ - రూపాలు, స్కంధాలు, ఆయతనాలు, ధాతువులు సంస్కారాలు, ఆర్యసత్యాలు, నిర్వాణం, ప్రతీత్యసముత్పాదం వంటివాటిని గూడా నిశితంగా పరీక్షించి సతార్కికంగా విశ్లేషించి అవన్నీ లోకసంవృతిసత్యాలే కాని పరమార్థాలుగావని తీర్మానించాడు ఆచార్యుడు. దానివల్ల రెండు పక్షాలవారి విమర్శలకు గురి అయ్యాడు. ఆచార్యుని సర్వశూన్యవాది గా వితండవాదిగా పరిగణించి ఆస్తికులు విమర్శిస్తే ప్రపంచ పదార్థాలేవీ యథార్థాలు గావంటూ వాటిని సూక్ష్మ ధర్మాలుగా విభజించి ఆధర్మాలను మాత్రమే యథార్థాలుగా గ్రహించుకొని వాటి ఆధారంగా నిర్మించుకొన్న పరమార్థాల నన్నిటినీ లోకసంవృతిసత్యాలనటాన్ని సహించలేని థేరవాదులు ఆచార్యుని వివరణను బౌద్ధ ధర్మ ప్రతిపాదికమే కాదంటూ ఆయన మధ్యమకకారిక వివరణకు ఆధారంగా గ్రహించిన ప్రజ్ఞాపారమితసూత్రాలు బుద్ధవచనాలే కావని తిరస్కరిస్తూ అవి ఆచార్యుని స్వకపోల కల్పితాలుగా భావించారు ఆచార్యుని మీద బౌద్ధేతర (వేదాంత) ప్రభావమున్నట్లుగా విమర్శించారు. ఆచార్యుని మధ్యమకకారిక వరవరడిలో గౌడపాదాచార్యుడు రూపొందించిన మాండూక్యకారిక ననుసరించి అద్వైతవేదాంతాన్ని రావించిన శంకరాచార్యుని ప్రచ్ఛన్నబౌద్ధుడుగా పరిహసించటాన్ని గూడా ఈ సందర్భంగా గుర్తుంచు కోవాలి. ఆవిధంగా ఆచార్యుని మధ్యమకకారిక భారతీయ దర్శన వికాసంలో ఒకకీలకస్థాన మాక్రమిస్తుంది. దానిని సక్రమంగా అర్థంజేసు కోవాలంటే భారతీయ దర్శనంలో దాదాపు 800 సంవత్సరాల పాటు క్రీ.పూ. ఆరోశతాబ్దనుంచి క్రీ.శ. రెండో శతాబ్దంవరకు బుద్ధునికాలనుంచి నాగార్జునుని వరకు సంభవించిన ప్రముఖ ఘట్టాలను స్పృశించు కోవలసి ఉంటుంది.

క్రీ.పూ. ఆరోశతాబ్దం ప్రపంచ చరిత్రలోనే సంచలనాత్మక యుగంగా మిగిలిపోతుంది. అటు గ్రీస్‌దేశంలో, ఇటు చైనా, ఈజిప్టు దేశాలలో భారతదేశంలోనూ ప్రపంచ సంస్కృతీ ప్రస్థానానికి పునాదులు ఏర్పడటంతో పాటు భవిష్యత్తరాలను ప్రభావితంచేయ గలిగిన చింతనాచైతన్యం వెల్లి విరిసింది. సనాతన సంప్రదాయ సంస్మరణంలో మునిగితేలుతూ ధారణనే పరమ ప్రమాణంగా భావించుకొనే మానసిక దాస్యశృంఖ లాలను ఛేదించుకొని ప్రపంచంగురించి, ప్రపంచంలోని పదార్థాలను గురించి వాటి ఆద్యంతాలను గురించి,

అనుభవాలను గురించి, వాటి మూలం గురించి, వాటియథార్థతను గురించి స్వతంత్రంగా ఆలోచించి ఎన్నోప్రశ్నలను సంధించారు, ఎనోసమస్యలను లేవనెత్తారు. దానికి స్పందించినవారు తోచిన సమాధానాల నందించటానికి ప్రయత్నించారు. వాటితో విభేదించినవారు స్వయంగా అన్వేషించి నూతన దృక్పథాలను వెలువరించారు. ఆ విధంగా ఆ శతాబ్దంలో భారతదేశంలో ఎంతో చింతనా వైవిధ్యం గోచరిస్తుంది, ఎంతో దార్శనిక వైదుష్యం గోచరిస్తుంది. అదే ఆనాటి అన్వేషణా వైశిష్ట్యాన్ని ప్రదర్శిస్తుంది. అటువంటి విశిష్ట ధర్మ ప్రతిపాదకంగానే బౌద్ధమావిర్భవించింది.

బుద్ధుడు ఈశ్వరకర్తృత్వాన్ని తిరస్కరించినట్లుగా పాళీగ్రంథాలు పేర్కొంటాయి. వీటి అన్నిటిలోనూ ప్రపంచపదార్థ వివరణకు ఏదో ఒక అధిశక్తి ఆధారం గావటం గమనార్హం. ఆ అధిశక్తికి ఆధారమేమిటని ప్రశ్నిస్తే దానికి మరొకమూలం - ఆమూలానికి ఇంకొక మూలమని వివరించుకొంటూ పోయి ఆపైన ప్రశ్నిస్తే తల బద్దలయిపోతుందని హెచ్చరించినా లెక్కజేయకుండా ప్రశ్నిస్తూ పోయిన విదగ్ధుని తల రాలి పడిందంటూ తార్కికాన్వేషణకు హద్దులు గీస్తుంది బృహదారణ్యకం[7].

అయినా అన్వేషణలు సాగాయి. ప్రపంచమూలంగురించీ అంతంగురించీ వాటి శాశ్వత - అశాశ్వతాలను గురించీ చర్చలు సాగాయి - వాద వివాదాలు సాగాయి. అవి అన్నీ తేలని సమస్యలను గురించి - తేల్చటానికి వీలులేని సమస్యలను గురించి - సాగుతున్నాయి కనుక వాటివల్ల ప్రయోజనంలేదని భావించిన బుద్ధుడు ప్రపంచంలో దుఃఖం గురించి ప్రపంచపదార్థాలను వివరించటం గురించి అన్వేషించాడు.

ప్రపంచ పదార్థాలకు ఏదోఒక మూలం ఉండాలంటూ సాగి ప్రపంచానికి మూలంగా ఒక అతీత పదార్థాన్ని సంభావించి దానికి మూలం ఉండదనటం; ప్రపంచ పదార్థాలన్నిటినీ అశాశ్వతాలంటూ వాటి మూలాన్ని శాశ్వతమనటం; ప్రపంచంనుంచి పదార్థాలను వేరుజేసి, వాటిని జీవ-అజీవులుగా విభజించి ఆ జీవులనుంచి మనుషులను వేరుజేసి, ఆ మనుషుల శరీరాలనూ మనసులనూ విడగొట్టి - వాటిని ఆత్మాధిపత్యంలో బెట్టి ఆ ఆత్మను బ్రహ్మతో ముడిబెట్టి అనేకత్వంలో ఏకత్వాన్ని అశాశ్వత ప్రపంచంలో శాశ్వతతత్వాన్ని ప్రతిష్ఠించే ప్రయత్నాలలో అవగాహనా రాహిత్యమే బుద్ధునికి కనిపించింది. అందుకే వారి నందరినీ దృష్టివాదులుగా పరిగణించి తిరస్కరించాడు. ప్రపంచాన్ని అనంతంగా విభజించు కుంటూ పోయి దానికొక అతీత శక్తితో - బ్రహ్మయినా - ఈశ్వరుడయినా- ప్రకృతిఅయినా మరేదయినా - సమైక్యంజేయబూనటం అర్థ రహితంగా భావించాడు. ప్రపంచస్థితినే యథాతథంగా యథార్థంగా గ్రహించి వివరించటానికి పూనుకొన్నాడు.

ప్రపంచమిదేవిధంగా నిరంతరంగా కొనసాతూనే ఉంటుంది. ప్రపంచ మంటే ప్రపంచ పదార్థాలే. ఆ పదార్థాలు నిరంతరంగామారి పోతూనే ఉంటాయి. నిరంతరంగా ప్రవహించే నది నిలకడగా ఉన్నట్లుగా కనిపిస్తున్నట్లే, ఈపదార్థాలు మారుతున్నా మారనట్లే కనిపిస్తుంటాయి. వాటిని సక్రమంగా అర్థంజేసుకోవాలంటే వాటి స్వరూప స్వభావాలను

విశ్లేషించి వివరించుకోవాలి. ఈ పదార్థాలన్నీ పంచస్కంధాల నిర్మాణాలు - రూప, వేదన, సంజ్ఞ, సంస్కార, విజ్ఞానాల ద్వారా నిర్మాణమవుతాయి. వాటికి ఆ స్కంధాలే ప్రత్యయాలవుతాయి. అ ప్రత్యయాలు ఒక దాని మీద ఒకటి ఆధార పడుతూ కొనసాగుతుంటాయి. ఉత్పత్తులు జరుగుతుంటాయి. ఉత్పత్తికి ఆధారంగా ఉండేది ప్రత్యయ ధర్మం-దానినుంచి ఉత్పత్తి అయేది ఉత్పత్తి ధర్మం. అంతాప్రత్యయ - ఉత్పత్తి ధర్మాల ద్వారా రూపొందేదే. అన్నీ నామ - రూప మాత్రాలే. అన్నిట్లోనూ రూపం-భౌతిక పదార్థముంటుంది. అన్నిట్లో నూ నామం-మానసి కాంశం -(వేదన, సంజ్ఞ, విజ్ఞాన స్కంధాలు) ఉంటుంది. అన్నిట్లోనూ చైతన్యముంటుంది. (సంస్కార స్కంధం). ఆ విధంగా అన్నీ పంచస్కంధ నిర్మితాలే. వాటి ఉత్పత్తికెటు వంటి అతీత శక్తితోనూ అవసరముండదు. స్కంధాల హెచ్చుతగ్గులను బట్టి పదార్థాల వైవిధ్యం సంభవిస్తుంది. రూపస్కంధం అధికంగా ఉంటే భౌతిక పదార్థాలవుతాయి. వేదన, సంజ్ఞ, విజ్ఞాన స్కంధాల విభేదాలను బట్టి జీవరాశులలో భేదాలుగోచరిస్తాయి. చైతన్యం-(సంస్కార స్కంధం) అన్నిట్లోనూ ఉంటుంది. అందువల్ల ప్రాయికంగా అన్నీ ఒకటే. అంతా ఒకటే. అంతా ప్రత్యయధర్మాల ద్వారా ఉత్పన్నమయేదే. అది ఆద్యంతరహితంగా సంభవిస్తూనే ఉంటుందంటూ ప్రపంచ వ్యవస్థనంతటినీ ప్రతీత్యసముత్పాదంగా వివరించాడు బుద్ధుడు. ఆ విధంగా ప్రపంచపదార్థాల సమైక్యతలోనే పరివర్తనాత్మకతను దర్శింపజేసి అతీత యధార్థాల అవసరంతొలిగించి కార్య-కారణాలను వేరువేరు పదార్థాలుగా పరిగణించటం అసంగతంగా వివరిస్తూ అన్నిటికీ మూలమయిన ధర్మాలను సక్రమంగా అర్థంజేసు కోగలిగితే ప్రపంచ ప్రావాహిక స్వభావం ఆవిష్కృతమవుతుందని ఉపదేశించాడు.

ఈ వివరణ ద్వారా బుద్ధుడు కార్య-కారణ సంబంధంతో అవసరంలేని ప్రత్యయ-ఉత్తత్తి ధర్మాల ప్రతీత్యాన్ని ప్రతిష్ఠించాడు. ప్రత్యయానికి అంతవరకూ లేని ఆధిక్యాన్ని సమకూర్చాడు. అట్లాగే ధర్మాన్ని ఒక నూతనార్థంలో ఉపయోగించాడు[8]- పదార్థాల మూల అంశాలను - ధాతువులను - ధర్మమన్నాడు. శాశ్వత -అశాశ్వత విభేదాలను తొలిగించి పదార్థ నిరంతర పరివర్తనంగా వివరించాడు. ప్రపంచాన్ని ఒక ఆద్యంత రహిత వ్యవస్థగా రూపొందించాడు. అటువంటి వినూత్న ధర్మ ప్రతిపాదనం వల్లనే భౌద్ధమొక విశిష్ట ధర్మమయి పోయింది.

బుద్ధుని అనంతరం బౌద్ధధర్మాన్ని వివరించే ప్రయత్నంలో 'అభిధర్మం' అభివృద్ధి చెందింది. బౌద్ధ ధర్మాలను సంస్కృత ధర్మాలుగా అసంస్కృత ధర్మాలుగా, సాస్రవ ధర్మాలుగా-అనాస్రవధర్మాలుగా విభజించటం ప్రారంభించారు. ఈ ప్రయత్నంలో విభాజ్యవాదులు, ఆభిధార్మికులు ప్రముఖ పాత్ర వహించారు. అది సర్వాస్తివాదుల ఆధ్వర్యంలో వ్యవస్థితమయింది. నామ - రూపాలను పంచస్కంధాలుగా విభజించినట్లే పంచస్కంధాలను, 72 సంస్కృతధర్మాలుగా మూడు అసంస్కృత ధర్మాలుగా, మొత్తం 75 ధర్మాలను విభజించారు. వాటిని సౌత్రాంతికులు మళ్లీ మూలాంతిక ధర్మాలుగా విభజించారు. ఆవిధంగా అందుకొన్న సూక్ష్మ ధర్మాలను యథార్థాలుగా భావించారు. ప్రపంచ

పదార్థాలు యథార్థాలుగావని తిరస్కరిస్తూనే వాటిని విభజించటం ద్వారా లభించిన సూక్ష్మ ధర్మాలను యథార్థాలుగా భావిస్తూ వాటికి ఉత్పాద స్థితి భంగాలుంటాయని అంగీకరిస్తూ, దాని ద్వారా కార్యకారణ వివరణకు అవకాశం గలిగిస్తూ ఆ దృక్పథంతో బౌద్ధ ధర్మాన్ని వ్యాఖ్యానిస్తూ బుద్ధుడు తిరస్కరించిన ధోరణులను పునరుజ్జీవింప జేసినట్లయింది. ఆ ధోరణులను విశ్లేషించి వాటి అసంగతను నిరూపించి బౌద్ధ ధర్మాన్ని పురాతన పునాదుల మీద పునర్నిర్మించవలసిన బాధ్యతను నాగార్జునుడు స్వీకరించవలసి వచ్చింది.

మరోవైపు ఆస్తిక దర్శనాలు ఒకస్పష్టమయిన రూపమందుకోగలిగాయి. గౌతముని ''న్యాయ సూత్రాలు'' పదార్థ యథార్థత నంగీకరిస్తూ ప్రమాణ ప్రమేయాలాదిగా 16 పదార్థాల తత్త్వజ్ఞానం ద్వారా నిఃశ్రేయస మందు తుందంటూ[9] ప్రపంచసృష్టిని సమర్థిస్తూ అసత్కార్యవాదాన్ని - ఆరంభవాదాన్ని ప్రారంభించింది. ప్రపంచ పదార్థాలన్నిటినీ ద్రవ్యగుణ కర్మసామాన్య విశేష సమవాయాలద్వారా వివరిస్తూ అవి అన్నీ ధర్మవిశేషం నుంచి ఉత్పన్నమవుతాయని బోధిస్తూ నైయాయిక దృక్పథం సమర్థకంగా సాగింది. కణాదుని వైశేషిక సూత్రాలు[10]. సృష్టి దృక్పథాన్ని అంగీకరించకుండ ప్రపంచ పదార్థాలన్నీ పురుష సహకారంతో సాగే ప్రకృతి విరూప పరిణామం ద్వారా సిద్ధిస్తాయంటూ అసత్కార్య వాదానికి ప్రాణంపోసింది. కపిలుని 'సాంఖ్య సూత్రాలు'[11]. త్రివిధ దుఃఖాలను పూర్తిగా తొలగించుకోవటమే పురుషార్థమంటూ ఇది ప్రారంభంగావటం, ఆనాటి విషయ ప్రాధాన్యాన్ని నిరూపిస్తుంది. 'పురుష విశేష ఈశ్వరః' అంటూ సాంఖ్యుల పురుషుని ఈశ్వరునిగా[12] వివరించిన పతంజలి 'యోగ సూత్రాలు' చిత్త ప్రవృత్తిని నిరోధించటం ద్వారా సమాధినందుకొని కైవల్యం సాధించుకొనే మార్గాన్ని క్రమపద్ధతిలో అందించింది. ఈ ఆస్తిక దర్శనాలన్నీ ఏదో ఒకరూపంలో కార్యకారణ వాదాన్ని సమర్థిస్తూ ప్రపంచ మూలాన్ని స్వతస్సిద్ధంగావిస్తూ ప్రపంచాన్ని పరతంత్రం జేస్తాయి. ప్రపంచ మంతటినీ పరిణామకంగా వివరించే సాంఖ్యంగూడా మూల ప్రకృతిని అమూలమనటం ద్వారా అదే ధోరణిని అనుసరిస్తుంది.

ఈవిధంగా ప్రపంచ పదార్థ యథార్థత నంగీకరించే ఆస్తిక దర్శనాలు సతార్కికంగా దానిని సమర్థించుకొనే ప్రయత్నమొకవైపు; ప్రపంచ పదార్థాలు యథార్థాలు గావంటూనే పరోక్షంగా వాటి యథార్థతా నిరూపణకు దోహదం జేసే థేరవాద బౌద్ధులు మరోవైపు - బౌద్ధ ధర్మాన్ని అస్తవ్యస్తం జేస్తున్నాయని భావించిన నాగార్జునుడు ప్రపంచ పదార్థ వివరణకుగాను బుద్ధుడుపదేశించిన ప్రతీత్య సముత్పాదమే ఆధారంగాసాగి బుద్ధుడు ప్రయోగించిన 'సంవృతి సత్యం'[14] 'పరమార్థ సత్యం'[15] అనే పదాలనే వినియోగించుకొని ప్రజ్ఞాపారమిత సూత్రాల ఆధారంగా, బౌద్ధ ధర్మాన్ని పునర్నిర్వచించే ప్రయత్నంలో 'మధ్యమక కారికను' ప్రారంభిస్తున్నాడు.

# 1

న స్వతో నాపి పరతో నద్వాభ్యాం నాప్యహేతుతః ।

ఉత్పన్నా జాతు విద్యన్తే భావాః క్వచన కేచన. ॥

స్వతహాగా గానీ పరతహాగా గానీ రెండు విధాలలోగానీ ఉత్పత్తి అవుతున్నట్లుగా గ్రహించేవేవీ ఎక్కడా ఉండవు.

ప్రపంచంలో కనిపించే ఈ రకరకాల పదార్థాలను గమనించిన వారి కెవరికయినా ఇవన్నీ ఎట్లా వచ్చాయి అనే సందేహం సహజంగానే కలుగుతుంది. తెలిసిన వారెవరినడిగినా అవి ఉత్పత్తి అయాయనో, జన్మించాయనో, పుట్టాయనో సమాధానం చెబుతాడు. దేని నుంచి పుట్టాయి అనే ప్రశ్నవస్తుంది. ఆ ప్రశ్నలోనే ప్రతిదానికీ ఒక మూలం, ఒక కారణం ఉంటుందనే భావం గర్భితంగా ఉంటుంది. ఒక పదార్థానికి మరోదానిని మూలంగా వివరించి, దానికి ఇంకొక దానిని మూలంగా వివరించి, దానికి వేరొక దానిని మూలమంటూ వివరించు కుంటూ పోయి చివరికి అన్నిటికీ దేవుడో, ఈశ్వరుడో, ప్రకృతో మరొకరో మూల మనే దశవస్తుంది. మరివారికి మూలమేమిటి అని ప్రశ్నిస్తే పోరానాస్తికుడా అని తిట్టి వారికి వేరే మూలముండదు. వారంతట వారే సంభవిస్తారు అంటారు. అట్లా ఎవరంతట వారు సంభవించటమే స్వతహాగా ఉత్పన్నంగావటం. వారి ద్వారా లేదా ఇతర మనుషుల ద్వారా లేదా పదార్థాల ద్వారా ఉత్పత్తిగావటం పరతహాగా ఉత్పత్తిగావటం. కొంత స్వతహాగా, కొంత పరతహాగా - సాలెపురుగు తనలోని పదార్థం నుంచే గూడు అల్లుకొన్నట్లు ఉత్పత్తి అయేవాటికి రెండూవర్తిస్తాయి. ఏమూలమూ లేదు - ఎట్లాగో ఉత్పత్తి అయాయి, సిద్ధంగా ఉన్నాయి. అవన్నీ నీకెందుకు అనుభవించు అనటం అహేతుకంగా ఉత్పత్తి అయాయనటం. ఆ విధంగా ఎవరయిన పదార్థాలు ఉత్పత్తి అవుతున్నట్లుగా గ్రహిస్తే ఈనాలుగు విధాలుగా ఉత్పత్తి అవుతున్నాయని అంగీకరించవలసిందేకాని మరో పద్ధతిలేదు.

అయితే నిశితంగా పరిశీలించి గ్రహిస్తే అటువంటివి - ఆవిధంగా ఉత్పత్తి అవుతాయనుకొనేవి - ఎక్కడా ఉండవని తేలుతుందంటాడు ఆచార్యుడు.

ఏ పదార్థమయినా ఉన్నది అంటున్నామంటే దానికొక పేరుంటుంది. ఒక రూప ముంటుంది. కొన్ని లక్షణాలుంటాయి. అదిఒక ప్రదేశంలో ఉంటుంది. ఒక సమయంలో ఉంటుంది. అటువంటిది ఉత్పత్తి కావటమనే సమస్యే ఉండదు. అది తనంతట తానూరాదు, మరోదాని నుంచీరాదు, రెండువిధాలుగానూ రానక్కరలేదు. ఎక్కడనుంచో ఊడి పడనక్కరలేదు. ఉదాహరణకు కుండ ఉంటే ఉంటుంది. మట్టినుంచి కుమ్మరి తయారుచేస్తాడని వివరిస్తే ఈకుండగాదు. ఈరూప లక్షణాలతో ఈ సమయంలో ఈ ప్రదేశంలో ఉండదు. అదే విధంగా పదార్థాలన్నిటినీ అర్థంజేసు కొన్నప్పుడు మనం సాధారణంగా ఉత్పత్తి అవుతాయని భావించుకొనేవేవీ నిజానికి ఉత్పత్తికావని తేలుతుంది. ఉత్పత్తికానివి ఉంటాయనటమే కుదరదుగదా! అందువల్ల అవేవీ ఉండవంటాడు ఆచార్యుడు.

ఈ కారికలో ఆచార్యుడు 'పదార్థం' అనే పదము ప్రయోగించలేదు. మనం అర్థంజేసుకోవటానికి ''భావః'' అనే పదానికి 'పదార్థం' అనే అర్థం జెప్పుకొన్నాం. అయితే 'భావం' - 'పదార్థం' ఒకటికాదు. మనం భాషలో ఉపయోగించే పదంద్వారా మనకు అర్థమయే వస్తువు పదార్థం. ఆపదానికుండే అర్థం ద్వారా ఆవస్తువు అర్థమవుతుంది. అది ఆ వస్తువు స్వరూప స్వభావాలను సమగ్రంగా అందించదు. 'భావం' అనేపదం వస్తువు పరివర్తనాత్మక స్వభావాన్ని అందజేస్తుంది. దానిద్వారా ఏవస్తువూ స్తబ్దంగా ఉండదనీ అది నిరంతరం పరివర్తన మందుతుందనీ అర్థమవుతుంది. 'భవతీతిభావస్య' ఉన్నది - జరుగుతున్నది అనేది భావాల సామాన్య లక్షణం. వాటికి ఆరు భావ వికారాలుంటాయి - పుట్టటం, ఉండటం, పరిణమించటం, పెరగటం, క్షీణించటం, నశించటం. ఆ విధంగా అన్నీ క్రియాశీలాలనే భావాన్ని 'భావ' మందిస్తుందని 'నిరుక్తం' వివరిస్తుంది[16]. ప్రపంచ వస్తువుల స్వభావాన్ని సక్రమంగా అందిస్తుందనే అవగాహనతోనే ఆచార్యుడు 'భావాః' అని ప్రయోగించాడు.

1. ప్రశ్నోపనిషత్తు -3
2. కేనోపనిషత్తు - 1
3. శ్వేతాశ్వరోపనిషత్తు - 1
4. బృహదారణ్య కోపనిషత్తు -1-2-1
5. ఛాందోగ్యోపనిషత్తు - 6-2-3,4
6. ఈశా వాస్యోపనిషత్తు - 1
7. బృహదారణ్య కోపనిషత్తు - 3-9-26
8. Th. Stcherbatsky, The Central Conception of Buddhism, preliminary, P.I.
9. న్యాయసూత్రాలు -1-1-1
10. వైశేషిక సూత్రాలు -1-1-2
11. సాంఖ్య కారిక -1-1
12. ''పురుష విశేష ఈశ్వరః'' యోగసూత్రాలు. సమాధిపాదం, 24
13. ''మూలేమూలే భావా దమూలం మూలం'', సాంఖ్యకారిక - 1-67
14. మన ఆలోచనంతా నామలక్షణ వికల్పాలద్వారా సాగుతుంది. ఒక పదార్థానికుండే పేరు, దానికుంటాయనుకొనే లక్షణాలు, దానిని గురించి మనమనసులో ఏర్పడే భావాలు - ఈ విధమయిన లౌకిక అవగాహన అవగాహన సంవృతి సత్యం. 'సంవృతి' పదాన్ని 'సమ్మతి' నుంచి వస్తున్నట్లుగా వివరించి, అది అమోదం పొందినదని వివరించాడు కలుపహాన -D.J. Kalupahana, Mulamadhyamakakarika of Nagarjuna, Int, P.17.
15. పరమార్థమంటే ఒక అతీత యథార్థంగా గ్రహించుకోవటం మనకు అలవాటయి పోయింది. ఇక్కడ సంపూర్ణమయిన అవగాహన అని మాత్రమే గ్రహించుకోవాలి.
16. పండితగోపదేవ్ (తెలుగు) నిరుక్తము, ప్రథమాధ్యాయం, పుటలు 8,12.

Printed, Published and Edited by ALAPATI RAVINDRANATH at Kala Jyothi ProcessLtd., 1-1-60/5, Iftekar Mansion Lane, RTC X Roads, Musheerabad, Hyd-20.
Ph. 612436, 612337

**Editorial NEST**
Plot No. 337-A, Road No. 10, Jubilee Hills, Hyderabad-500 033. Phone : 247717.

